## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016122

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

Approved by the T. B. C. Madras. Vide : Cons. List, D. 19-5-54, for Ele. Part I, Page 44, for Secondary, Part II, Page 125.

# రాయల నీతికథలు

## (నాల్గవ భాగము)

6-వ తరగతి, లేక 1-వ ఫారము

గ్రంథకర్త:

పుట్టపర్తి నారాయణాచార్యులు




ప్రకాశకులు:

రాయలు అండ్ కో.,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు, కడప.

బ్రాంచి: 32, నారాయణమొదలివీధి, మద్రాసు - 1

కాపీరైట్] 1955 [వెల 0-8-0

# తొలిపలుకు

ఆంధ్రరాష్ట్రము వచ్చినది; అనఁగా నాంధ్రులు దమ తల్లి నుడి లోని మాధుర్యమును గమనించి 'నాభాష యింతటి'దని యెద విఱిచికొని తిరుగవలసిన శుభసమయ మేతెంచినదన్నమాట. మాతృభాషల కితోధిక మగు ప్రోత్సాహము లేనిచో భాషారాష్ట్రము వచ్చినట్లే కాదు.

ఈ 'నీతికథలు' నొక ప్రత్యేకదృష్టితో వ్రాసితిని. ఇందు నేను వాడిన భాష సరళము; తీవ్రభావనా సంయుక్తము. అక్కడక్కడ ననేక జాతీయములు వాడి, 'తెనుఁ గిది' యని చూపించితిని.

ఏరుకొన్న కథలుగూడ వైవిధ్యముగలవి. కొన్ని పౌరాణికములను, మఱికొన్ని చారిత్రకములను గ్రహించితిని. మొన్న మొన్నటి రాజకీయ నాయకుల జీవితములుగూడ నొకటి రెండు జేర్చఁబడినవి.

ఒకటే భావముపై 'ఏకతార' వలె నిరంతరదృష్టి పెట్టినచో - నా భావ మెంత యుదాత్తమైనను - దానిపై బాలకులకు విసుగుగల్గును. అందుచే నన్నిరంగములయందును గొందఱు గొప్పవారిని విద్యార్థుల యెదుట నిల్పితిని. ఈ కథలు జదివినచో - ముఖ్యముగ - నెవ్వరైనను బ్రయత్నించినచో గొప్పవారు గాఁగలరను నూహ బాలకుల హృదయము లలోఁ బాదుకొనును. ఆ భావమును వారి మానసక్షేత్రములందుఁ జక్కఁగ విత్తవలెననియే నాయూహ. ఈ నా ప్రయత్నమును వాఙ్మయ ప్రీతి గల యధికారులేమి యితరులేమి ప్రోత్సహింతురని నమ్ముదును.

శ్రీ జక్కా సుబ్బారాయఁడు నామిత్రుఁడు; భాషాప్రేమ, భగీరథుని వంటి పట్టుదల యాతనివి. స్వయముగ సోమరినగు నాతో నీ కార్యము చేయించినందుల కతనికి నాకృతజ్ఞత.

ఇట్లు

'సరస్వతీపుత్ర'

పుట్టపర్తి నారాయణాచార్యులు.

# విషయ సూచిక

# రాయల నీతికథలు



## ౧. నారదుడు

వాని పేరుపబర్హణుఁడు. వాఁడు పేరెన్నికగన్న గంధర్వుఁడు; అమితపరాక్రమము గలవాఁడు. వాని ధాటి కందఱును భయపడుచుండిరి. అందుచే నుపబర్హణుని దండించువా రెవ్వరును లేరు. వాఁడు గామచారి యైనాఁడు. ఎల్లప్పుడును స్త్రీల సావాసముతో వానికి రాత్రింబగళ్లు దెలియుటలేదు.

ఒకనాఁడు, బ్రహ్మసభకు వానికిఁ బిలుపు వచ్చినది. అయినను వాని మనసున భయములేకుండెను. దుర్దమమగు యౌవనముయొక్క మాహాత్మ్య మట్టిది. వాని పరాక్రమము గూడ నా గంధర్వుని యవినయమునకే కారణమైనది. వాఁడు బ్రహ్మసభకుఁ బోయినాఁడు. పోయినవాఁ డొంటిగఁ బోలేదు. తనవెంట ననేక గంధర్వకాంతలను గైకొని వెళ్లినాఁడు. వారందఱితోడను వాఁడు బ్రహ్మసభలోనికిఁ బ్రవేశించెను. చిన్న, పెద్ద తారతమ్యజ్ఞానమునే యుపబర్హణుఁడు మఱచినాఁడు.

ఉపబర్హణుని ప్రవర్తనము బ్రహ్మసభయందున్న మహర్షులకుఁ గంటకమైనది. వా రొకరి మొగ మొకరు జూచికొనిరి. కాని, వా రతిశాంతులు. ఎంత కోపము

గలిగినను, దాని నడచికొను వశిత్వము ఋషుల కుండును. అందుచే వా రేమియుఁ బలుకకైరి.

కమలాసనమునందున్న బ్రహ్మదేవుఁ డుపబర్హణుని వాలకమును గమనించినాఁడు. నిండుసభయందు వాఁ డట్లు ప్రవర్తించుట దన్నవమానించుటగాఁ గమలాసనునకుఁ దోఁచెను. ఆయన గంధర్వుని వైపు నాలుగు మోములను ద్రిప్పిచూచెను. వాఁ డంతలో జంకినాఁడు. ఉపబర్హణుఁడు జంకులోపలనే బ్రహ్మముఖమునుండి "పతితుఁడవై భూలోకమున జన్మింపుము. దాసీపుత్రుఁడవై జన్మింపుము." అను శాపాక్షరములు బయల్వెడలినవి. ఉపబర్హణునకుఁ గన్నులు గానవచ్చినవి. వాఁడు బ్రహ్మదేవు నెంతయో ప్రార్థించినాఁడు. ఎంత ప్రార్థించి యేమిలాభము? సురజ్యేష్ఠుని వాగక్షరములకుఁ దిరుగులేదు. ఉపబర్హణుఁడు బ్రహ్మశాపముచేఁ జిక్కి నశమయ్యెను.

మఱుజన్మమున నుపబర్హణుఁడు దాసీపుత్రుఁడైనాఁడు. ఆమెకు వీఁ డొక్కఁడే కుమారుఁడు. అందుచే నా దాసి యల్లారుముద్దుగ నా పసిపాపను బెంచుచుండినది. కాని, యా దాసీపుత్రుఁడు జాల వినయవంతుఁడు. భౌతికములగు నాశ లంతటి చిన్నవయసుననే వాని హృదయమునఁ జోటు సంపాదించుకొనలేకపోవుచుండెను. ఆ బాలకుఁడు దన 'కిది గావలె, నది గావలె'నని కోరఁడు. అమ్మ యేది పెట్టిన నది తినును. ఏబట్ట గట్టిన దానితోఁ దృప్తిపడును. తోడిపిల్లలతో నాటలకుఁ జేరఁడు. వాని యాటలే వేఱు. వాని తీరే వేఱు.

ఇంతలోఁ నా యూరికిఁ గొందఱు ఋషులు వచ్చిరి. వారు 'చాతుర్మాస్యము' నచ్చోటఁ గడపఁ దలఁచినారు. 'చాతుర్మాస్యవ్రత' మనఁగా, నాలుగునెల లెక్కడికిని గదలక యొకచోటనే యుండి నియమితముగ ధ్యానాదులను జేయుట. ఋషు లీ 'చాతుర్మాస్యము'ను వర్షావేళలలోఁ జేయుదురు.

చాతుర్మాస్యపరులైన ఋషు లీదాసీపుత్రుని వీక్షించినారు. వీని బాలకము మహర్షులకుఁ గ్రొత్త తీరై యుండెను. వారు యోగదృష్టితో నీబాలకుని వృత్తాంతమును గమనించినారు. గమనించి వానిని జనవున జూడసాగిరి. ఆ బాలకుఁడును దన వినయముతో వారి చనవును రెండింతలుగావించికొన్నాఁడు. వాఁడు వారికిఁ బూజాకుసుమముల విలిచికొని తెచ్చుచుండెను. వంటకట్టెలు దెచ్చుటకుఁ దోడుపడుచుండెను. ఆ ఋషుల భజనలలోఁ బాల్గొనుచుండెను. ఒక్కొక్కనాఁడు వారి కడనే భుజించుచుండెను. ఆ మహర్షుల యుచ్ఛిష్టమునుగూడ వాఁ డాదరముతో నారగించెను. వాని సేవాపరత్వము మునుల కాదరమును బెంచినది. ఇంతకును వాఁడు బంచాబ్దంబులవాఁడు.

'చాతుర్మాస్యము'ను ముగించికొనిపోవుచున్న ఋషులా బాలకునకు 'వాసుదేవమంత్రము' నుపదేశించినారు. సాధుసేవ వ్యర్థముగఁ బోవదుగదా!

నాఁటినుండియు వాని కామంత్రమే యాహారవిహారములైనది. వాని తల్లియుఁ గుమారుని ప్రవర్తనమున కాశ్చర్య

పడినది. ఆమె "యింత చిన్న వయస్సున నీభక్తియేందు" కని మరలింప యత్నించెను. కాని వాఁడు వినుట లేదు. తన భక్తికిఁ దల్లి విఘ్నకారిణి యని వానికిఁ దట్టి బాధపడు చుండినాఁడు.

ఒకనాఁ డపరసందె వేళ ఆ దాసి పనులు ముగించికొని తన గుడిసెకు వచ్చుచుండెను. త్రోవలో నొక నల్లత్రాఁచు జుట్టజుట్టికొని పండుకొన్నది. ఆ దాసి సర్పమును జూచినది గాదు. దానిపై నామె యడుగు వేసెను. అడుగు వేయుటయే తడవు నల్లని నాగేంద్రుఁడు బడగ నెత్తి 'ఫటుక్కు'మని కఱచినాఁడు. విష మా ముసలిదాని శరీరమున నరనరమునకుఁ బ్రాఁకిపోయెను. మఱునిమేషమున దాసి ప్రాణములు అంత రాళమునఁ గలిసిపోయినవి.

బాలకుఁడు మాతృమరణమునకు శోకింపనే లేదు. వాఁడు నడచుచు వింధ్యారణ్యమునఁ బ్రవేశించినాఁడు. చాల దూరము నడచుటచే నా పసికందు కలఁతయైనది. ఒక సరస్సునందు నీరు ద్రావి రాగిచెట్టుక్రిందఁ గూర్చుండి, ధ్యానము సేయ మొదలువెట్టెను. వెంటనే యా బాలకుని హృదయసీమలో శంఖచక్రాంకితమై, శ్రీవత్సాంకితమగు నొక జ్యోతి దోఁచినది. ఆ బాలకుఁ డానందమున దానిని వీక్షించుచుండెను. చూడఁ జూడ నది మాయమైనది.

ఆ బాలకునకు దిక్కుదోఁచలేదు. వాఁడు మహా వ్యాకులుఁడై క్షోభించుచుండెను. అపు డాకాశమునుండి వేదవాణి యిట్లు వినిపించినది : "బాలకా! సాధుసంగముచేతఁ

ఋనీతుఁడవైతివి. వారికి నీవు గావించిన సేవాఫలమే నేఁడు నా స్వరూపమును నీవు ధ్యానమునఁ గాంచగల్గుట. సజ్జనుల కృపాబలముచేఁగాక యితరమార్గములచే నన్నుఁ బొందుటశక్యము. కాని యీజన్మమున నీవు నన్ను బరిపూర్తిగఁ బొందఁజాలవు. వచ్చు కల్పమున నీవు మహర్షి వయ్యెదవు. అంతవఱకు నోపిక బట్టుము.''

బాలకుఁడు వినయమున లేచి, యా సవ్వడి వీతెంచిన దిక్కునకు సాగిలపడి నమస్కరించెను. అతఁడు భగవద్భక్తితో నా జన్మమును గడపినాఁడు.

మఱుజన్మమున నా బాలకుఁడు బ్రహ్మదేవునకు మానసపుత్రుఁడై జనించెను. అతఁడే నారదుఁడు. దేవఋషి. భగవంతునకుఁ బ్రియమైన భక్తుఁడు.

## ౨. వేదాంతదేశికులు

భగవద్రామానుజులు ప్రచారము జేసిన సంప్రదాయమునకు 'విశిష్టాద్వైత' మని పేరు. ఈ సిద్ధాంత మంతకుముం దున్నదే. కాని, వారా సంప్రదాయము నెక్కువ ప్రాముఖ్యతకుఁ దైకొనివచ్చిరి. శ్రీరామానుజు లామత ప్రచారమునకై పడిన ప్రయాస మింతింతగాదు. రామేశ్వరమునుండి హిమాలయమువఱకు వారు గాలి నడకను ప్రయాణము సాగించినారు. అంతకుముందు 'శైవులు'గ నున్న యెందఱో రాజులు రామానుజులను జంపఁ బ్రయత్నించిరి. దైవబలముతోఁ, బురుషకారముతో శ్రీరామానుజు

లాకష్టము లన్నిటిని దాటిరి. వా రేర్పఱచిన ప్రధాన మతములు బదునాలుగు. వానియందు 'వైష్ణవాచార్యుల' ను శ్రీరామానుజులే యేర్పఱచినారు. శ్రీ వేదాంత దేశికులు రామానుజుల తరువాత రామానుజు లంతటివారు.

వేదాంత దేశికుల జనకుఁ డనంతసూరి. ఆయన సకల శాస్త్ర పారంగతుఁడు. వైష్ణవ సిద్ధాంత నిధి. వీరి నివాసము గాంచీనగరమునందు. కాంచీనగర మానాఁడు సమస్తశాస్త్ర వ్యాసంగములకు నాధారభూమి. ఎన్నియో పాఠశాల లాయూర నెలకొనియుండెను. వానియందుఁ జదువు విద్యార్థులు వేలకుండిరి. అనంతసూరిగూడ అనేక శిష్యులకు విద్యాదాన మొనరించిన మహనీయుఁడు.

వేదాంత దేశికులు జన్నతనమునుండియే మహాప్రతిభా శాలి. శాస్త్ర రహస్యము లన్నియు వారి కొననాల్కపై నూగిసలాడుచుండెడివి. ఇరువదేండ్ల చిఱుప్రాయముననే దేశికుల కీర్తి సర్వవిద్వాంసులకును మల్లికామాల యైనది. వారి యెదుట నిలచి వాదముసేయు గుండెలు గల పండితుఁ డాకాలమున భారతదేశమున లేఁడు.

వేదాంత దేశికులు బరమ భక్తులు ; మహావిరక్తులు. ఇంత పాండిత్య ముండియు వా రేరాజునుగాని యాశ్రయించి నది లేదు. కంచిలోని రాజాధిరాజగు భగవంతుఁడు వరద రాజుల పాదములనే వా రాశ్రయించియుండిరి. పరమ భక్తు లకుఁ బ్రాప్తించు దారిద్ర్యము వారినిగూడ వదలినది గాదు. ఇంట నిష్పచ్చరము దాండవించుచుండెను. కాని, వా రొక

నాఁడుగాని దారిద్ర్యమునకు నిట్టూర్చినది లేదు. భగవంతుని వదలి మానవుల వైపు జూపు ద్రిప్పినది లేదు.

దేశికుల కాలమున 'విద్యారణ్యు'లను మఱియొక పండితుఁ డుండెను. వారు మహాతపస్వులు. విద్యారణ్యులు వేదాంత దేశికులకు సహాధ్యాయి. వారు దమ తపశ్శక్తిచేతను, పాండిత్య బలముచేతను విద్యానగర రాజులకుఁ గులగురువులైనారు.

విద్యారణ్యులకు దేశికుల కున్న నిష్పచ్చరము దెలియును. అందుచే వారెటులైనను వేదాంత దేశికులకు రాజదర్శనము సేయించి, వారి దారిద్ర్యమును బాప నిశ్చయించికొన్నారు. విద్యారణ్యులు వేదాంత దేశికులకు 'విద్యానగరమునకు ర'మ్మని శిష్యముఖమునఁ బ్రార్థనము బంపిరి. రాజగురువులగు విద్యారణ్యు లనుగ్రహించిన కమ్మను దిలకించి 'దేశికులు' నవ్వుకొన్నారు. వారు విద్యారణ్యుల కొక జాబును శ్లోకబద్ధముగ వ్రాసి పంపించినారు. ఆ జాబునం దైదు శ్లోకము లుండెను. ఆ పద్యము లన్నిటికని గలిపి 'వైరాగ్య పంచక' మని పేరు. ఆ శ్లోకముల భావ మిది:

"బ్రహ్మాండ మనంతమైనది. అందులో నొకమూలను మాత్రమే రాజులు పాలింతురు. ఆ యింత యధికారమునకే వారి కెంతయో గర్వము. ఆ రాజు లోకవేళ దానమిత్తురనుకొమ్ము. ఎంతమాత్ర మిత్తురు? నేను నమ్మిన దేవాదిదేవుఁడు సమస్త ప్రపంచములకును నాయకుఁడు. వానికిఁ బూర్వకాలమునఁ గుచేలుఁడు బుడిసెఁ డటుకుల నిచ్చెను.

ఆ యింతమాత్రముననే తృప్తిపడి, నాదైవ మా కుచేలునకు అష్టైశ్వర్యముల నొసఁగినాఁడు. నేను నమ్మిన వరదరాజుల యౌదార్య మంతటిది. నే నేమియు సంపాదింపలేదు. మా తండ్రిగూడ నేమియు సంపాదించినవాఁడు గాఁడు. కాని, నా కేమి భయము! మా తండ్రి తాతలనాఁటి యాస్తి వరదరాజ స్వరూపమై కంచియం దున్నది!''

ఈ జవాబునకు గుణగ్రాహులగు విద్యారణ్యు లెంతయో సంతోషపడినారు.

వేదాంతదేశికులు గరుడమంత్రము నుపాసించిరి. ఆ గరుడుఁడు ప్రత్యక్షమై, దేశికులకు హయగ్రీవమంత్రము నుపదేశ మొసఁగెను. హయగ్రీవుఁడు సమస్తవిద్యల కధినాథుఁడగు దైవము. ఇఁక దేశికులకుఁ బాండిత్యమున కేమి కొదువ ?

ఒకనాఁ డొక బ్రహ్మాండ పండితునితో వేదాంతదేశికులకు వివాద మేర్పడినది. ఒకరాత్రిలోపల రంగనాథులపై వేయి శ్లోకములను వ్రాయవలెనని కట్టడ. అట్లు వ్రాయలేనివారు నాఁటినుండి కవితారచన మానుకొనవలెను. వేదాంతదేశికు లీపందెమున కొప్పికొన్నారు.

ప్రత్యర్థియగు పండితుఁడు రాత్రియంతయు నిద్రవీడి యెంతెంతయో యాలోచించెను. తెల్లవాఱులోపల నానా ప్రయాసలు బడి వాఁడైదునూఱుల శ్లోకములు వ్రాసినాఁడు.

దేశికులు రాత్రియంతయు నిర్విచారముగ నిద్రించినారు. ప్రత్యూష పవనాంకురములు వీచువేళ వాసుకప్రశా

రము నిద్రలేచిరి. ఏకాంత భక్తితో ననుష్ఠానమును దీర్చు కొన్నారు. శ్రీ హయగ్రీవమంత్రమును ధ్యానించి కవితా రచన కాయత్తులైరి. ప్రక్కనున్న ఛాత్రగణము వారు బలుకు శ్లోకములను వ్రాసికొనుచుండెను. కవిత్వ మనర్గళ ప్రవాహముతో వచ్చినది. హయగ్రీవులే దేశికుల ముఖమున నిలచి కవితలఁ బలుకుచున్నటు లుండెను. సూర్యోదయ మునకు సరిగా వేయిశ్లోకములు బూర్తియైనవి.

శ్రీరంగనాథుని గుడిలోఁ బెద్దమనుష్యులు జేరినారు. వేదాంత దేశికులు దమ వేయి శ్లోకములను జదివి, పండితు లకు వినిపించిరి. ప్రతివాది పండితుఁడు వేయి శ్లోకములు వ్రాయలేకపోయినాఁడు. ఇఁక నాతఁడు బందెమున నోడి నట్లే కదా! అవనతముఖుఁడై యా విద్వాంసుఁ డవమాన మునఁ గన్నీరు గార్చుచుండెను. వేదాంత దేశికుల మనసు కరఁగినది. వా రాతని నెంతయో యూరార్చిరి. దేశికు లన్నమాటలు జూడుఁడు: "అయ్యా! నీవు మహా పండితుఁ డవు. నీవు వేయిశ్లోకములు వ్రాయకున్నమాత్రమున నీ గొప్పతనమున కే లోపమును రాలేదు. నీవు వ్రాసిన యైదు నూఱుల శ్లోకములు లోకప్రశస్తముగ నున్నవి. నీ రచన ముతో నా శ్లోకములు దులఁదూగ లేవు. ఒక వరాహ మున్న దనుకొనుము. అది సుతశతము నీనును. కాని, లాభ మేమి? ఆఁడేనుఁగు బండ్రెండు సంవత్సరముల కొక కూన నీనును. ఆ యేనుఁగు గున్నను మహారాజులు బూజించెదరు. మన ఇద్దరి కవితల కంతటి భేద మున్నది. విచారపడకుము." ఆహా! ఏమి

వినయప్రదర్శనము! ఎంతటి కరుణాపరత్వము! వేదాంత దేశికుల స్వరూప మట్టిది.

వేదాంతదేశికుల కీర్తి కసూయపడిన కొందఱు వీరి యెడ నెంతయో యమర్యాదగఁ బ్రవర్తించిరి. దేశికులా యవమానముల నన్నిటిని దన వినయ సంపదలతో మహోత్తరమానములుగ మార్చివేసిరి.

దేశికులు డమ జీవితమున నూటయెన్మిది గ్రంథముల వఱకు వ్రాసినారు. వానిలోఁ గొన్ని 'దమిళము'నం దున్నవి. తక్కినవి సంస్కృతభాషయందుఁ గలవు.

వేదాంతదేశికుల కవిత్వము జాల ప్రౌఢమైనది. కాళిదాసుని తరువాత దేశికులను గొప్పకవిగా సంస్కృత విద్వాంసు లెన్నెదరు. అంతటి పాండిత్యమును, అంతటి వినయమును, ఆపాటి వైరాగ్యమును వేదాంతదేశికులకే చెల్లినవి.

## ౩. గాయకశిరోమణి తాన్సేను

దక్షిణదేశమునఁ బ్రచారమందున్న గానమునకుఁ 'గర్ణాట' సంగీతమని పేరు. ఈ సంగీత సంప్రదాయమునకు గొప్ప సేవజేసిన యతఁడు త్యాగరాజు. ఔత్తరాహులు పాడు సంగీతము గర్ణాటసంగీతమువలె నుండదు. దాని 'శాణి' ద్రోత్తది. ఆ సంప్రదాయమున కధిష్ఠాత 'తాన్సేను'.

తాన్సేను జన్మస్థానము గ్వాలియర్ సంస్థానము నందలి 'బేహాట్' అను గ్రామము. ఇతని తండ్రి మకరంద

పాండే యనునాతఁడు. ఇతనికిఁ జాలకాలము సంతానము లేకుండెను. అందుచే నతఁ డతిశ్రద్ధా భక్తులతో నిందుధరుని సేవించినాఁడు. ఆ పరమశివుని కరుణయే తాన్సేను రూపమున 'మకరందు' నకు సిద్ధించినది.

లేక లేక కలిగిన యీ కుమారుని దలిదండ్రు లతి ప్రేమతోఁ జూచిరి. ఏమి జూచిన నేమి? వాఁడు మూగ. ఆ కుమారుని జూచినపుడు 'మకరందుని' హృదయము బొట్టు పొర లగుచుండెను. సర్వానర్థములకును విరుమందు భగవత్సేవయేగదా! అందుచే మకరందుఁడు రెండింతలగు పట్టుదలతో నీశ్వరు నారాధించినాఁడు. ఆ సదాశివుని దయాతిశయమునఁ దాన్సేనునకు మాటలు వచ్చెను.

ఒక్క మాటలే కాదు, వసంతమునందలి కోయిలల పంచమ స్వరమును దప్పువట్టు గాత్ర సౌభాగ్యముగూడ వానికి సిద్ధించెను. గానమే గాదు, దానికి సర్వవిధముల గౌరవము నొసఁగు భగవద్భక్తియుఁ 'దాన్సేను' నకుఁ బ్రాప్తించినది. తాన్సేను రసమత్తుఁడై పాడుచున్నపు డా యూరివా రందఱి కాశ్చర్యమే! వాని గొంతునం దొకసారి మేఘము లుఱిమిన ట్లుండెడిది. గవ్వలను గదికిన ట్లుండెడిది. వాఁ డొక్కొకపాట బాడినపు డాపల్లె యంతయు నమృతము వర్షించినట్లు లుండెడిది. శాస్త్రనియమము నెఱుఁగని యీ కింతమాధుర్యము నియమమునకు లొంగని మహాప్రవాహము వలె నుండెను. మకరందుఁడు దన కుమారు నొక మంచి 'సంగీత విద్వాంసుని' కడఁ జేర్ప యోజించుచుండెను.

తాన్సేనునకు భగవద్భక్తియుఁ జిన్ననాఁటినుండి యలవడెనని ముందే చెప్పితిమిగదా! వయసు గడచుకొలఁదియు నాభక్తిగూడఁ బెరిగినది. అతని చిత్తము 'రాధాకృష్ణుల' యందు లగ్నమైయుండెను. ఆ పరమాత్మునిఁ జూపించువారెవ్వరు? ఈ చింతతో నాతఁ డిల్లు వీడినాఁడు.

ఆ తండ్రి కుమారునకై యెంతయో వెదకెను. కాని వాని జాడయే యెవ్వరును జెప్పరైరి. మకరందుఁడు శంకరు నారాధించికొనుచు శుభకాలమున కెదురుచూచుచుండెను.

ఇల్లువీడిన 'తాన్సేను' సన్న్యాసి దుస్తులను ధరించినాఁడు. నిరంతర మాతఁడు భగవల్లీలలను గానమొనర్చుచుండెను. ఆ సంగీతమును విన్నవారు జంత్రములవలె నెక్కడివా రక్కడే నిలచిపోవుచుండిరి. తిరిగి తిరిగి తాన్సేను 'రీవా' సంస్థానములోనికి వచ్చెను. ఆ సంస్థానము నప్పుడు రామచంద్రుఁ డను రాజపుత్రుఁడు పాలించుచుండెను. ఈ బాలగాయకుని కీర్తి యాతని చెవిఁబడినది. తాన్సేను సంగీతమునకు రామచంద్రుఁ డాకృష్టుఁడైనాఁడు. ఆ పిల్లవాని నాతఁడు దన సంస్థానమున నుంచికొనెను. 'తాన్సేను'పై నారాజు జూపిన యభిమాన మింతింత గాదు. రా జెంత యాదరముతోఁ జూచుచున్నను నా బాలగాయకుని మదికి శాంతి లేదు. ఆతఁ డిల్లువదలినది లోక సన్మానమునకుఁ గాదు; మహారాజుల మనస్సులను గరఁగించుటకుఁ గాదు. ఒకానొక నాఁడు 'దాన్సేను' 'రీవా' నరేంద్రునకుఁ జెప్పకయే యిల్లు వదలినాఁడు.

'తాన్సేను' నేరుగా బృందావనమునకు వచ్చినాఁడు. అచటి ప్రతికుంజమునం దాతఁడు కృష్ణునికై వెదకెను. వికసించిన ప్రతి కుసుమమునందును రాధాదేవిదర్శనము నాకాంక్షించెను. ఇంతలో 'బృంద'లో వసంతము వచ్చినది. అన్ని కడలను వసంతము వచ్చును. బృందావనమునందలి యామని యన్ని వసంతములవంటిది గాదు. అక్కడ వసంతము దన సర్వసౌభాగ్యములతో సాక్షాత్కరించును. బృందావనమునందలి 'యమున' కిరువైపుల నుత్తాలములగు వరణ్యములు. అవి యన్నియు వసంతుని ప్రేరణమున నువ్వెత్తుగఁ బూచినవి. బృందావనమునందు వసంతములలోఁ గృష్ణుఁ డెన్నియో క్రీడలు గావించెను. ఆఛాయలు దాన్సేను మనసున మెదలాడినవి. అతఁడు వెఱ్ఱివాఁడైనట్లు ప్రవర్తించెను. క్షణక్షణమును కృష్ణ వియోగమున వాని హృదయము దల్లడిల్లెను. కంఠము తంద్రమై పోవువఱకు వాఁడు బాడెను. పాడిపాడి యలసి 'తాన్సే'నొక చెట్టుక్రిందఁ బడి నిదురవోయినాఁడు.

నాఁడు బృందావనమున 'హరిదాస'ను గొప్ప భక్తుఁ డుండిరి. వారు కృష్ణసాక్షాత్కారము నందిన మహనీయులు. నింబార్క సంప్రదాయమునకుఁ జెందినవారు. సంగీతమే పరమాత్మప్రాప్తికిఁ బరమసాధనమని వారి సిద్ధాంతము. వారి కానాఁడు సంగీతమునందుఁ గల ప్రతిష్ఠ యద్వితీయమై యుండెను.

అలసి సొలసి పడియున్న 'తాన్సేను'ను హరిదాసులు జూచిరి. వా రపుడు 'నిధువనము' నుండి యమునాకూలము

మీఁదుగా నాశ్రమమునకుఁ బోవుచుండిరి. ఈ బాలకుని జూచినంతన వారి మనసు ప్రేమోద్రిక్తమైనది. వా రా బాలకుని సేదదేర్చి వాత్సల్యమున నిట్లు పలుకరించిరి:

"వత్సా! ఇక్కడ నెందుల కున్నావు? నీ తలిదండ్రు లెవ్వరు? నీ మొగము జూడఁ జాల నలసినటు లున్నది. దగ్గఱనే మా యాశ్రమ మున్నది. అది 'శ్రీధాము' సన్నిధానము. అక్కడికి వచ్చి యాశ్రయ మందుము."

హరిదాసుల ముఖము జూచినతోడనే 'తాన్సేను' హృదయము వారికి లోఁబడిపోయినది. బ్రహ్మ సాక్షాత్కార మందినవారి దర్శన మట్టిది. హరిదాసుల యాజ్ఞను సమ్మతించి 'తాన్సేను' వారి యాశ్రమమునఁ బ్రవేశించెను.

బాలగాయకుని కంఠ మాధుర్యమునకు హరిదాసులు మురిసిపోయిరి. వారి యుపదేశముచే 'గానమే మోక్షసాధన' మను విశ్వాసము 'తాన్సేను' నకు బాగుగ నాటుకొని పోయినది. అతఁడు ద్విగుణీకృతోత్సాహముతో సంగీతము నభ్యసింప నారంభించెను. గాయక శిరోరత్నమగు హరిదాసుల శిక్షణలచేఁ 'దాన్సేను' గాత్రసౌభాగ్యము తరిమెన బట్టిన వజ్రమైనది. శాస్త్రరహస్యము లన్నియు హరిదాసులు తాన్సేనునకుఁ బ్రేమతో నేర్పిరి. భారతదేశమునఁ 'దాన్సేను' వంటి గాయకు లుండరాదని హరిదాసు లాకాంక్షించిరి. గురువుల యభిలాషను శిష్యుఁడు సమగ్రముగఁ బూరించినాఁడు. వారి యిద్దఱి యొద్దిక రాగతానములవలె, శబ్దార్థములవలెఁ, బ్రకృతి పురుషసంయోగమువలెఁ బ్రకాశించెను. ఇఁక సంగీతమున కేమి కొదువ!!

అక్బరు చక్రవర్తి యాస్థానమునఁ 'దాన్సేను' గాయకుఁడు. అతని గానమున కక్బరు సర్వరాజ్యమును ద్యాగము జేయ సిద్ధముగ నుండెను. 'తాన్సేను' అక్బరు చెలికాఁడు. అక్బరునకు హితుఁడు, బంధువు, మంత్రి. 'తాన్సేను'ను జూడని నిముసమున సార్వభౌమునకుఁ బిచ్చిపట్టిన ట్లుండెడిది. అక్బరు కడఁ దాన్సే నొకఁడే విద్వాంసుఁడు గాఁడు. ఇంక ననేకు లుండిరి. కాని తాన్సేనన్న చక్రవర్తి ప్రాణములు లేచి వచ్చెడివి. అక్బరు చక్రవర్తి 'తాన్సేను' తోఁ జేరి యనేక క్షేత్రములను దరిసించెను. చక్రవర్తి గాయక సార్వభౌముని చెలికారముతో భక్తుఁడైనాఁడు. ఆనాఁడు 'తాన్సేను' గానము వినుటకు మహారాజులు గాచెడివారు. అతని కున్న వైభవ మనంతము. 'తాన్సేను' ఎన్నియో భక్తిపూరితములగు గేయములు వ్రాసి పాడెను. ఆనాఁడు 'సూరదాసు' మహాభక్తుఁడు. అతఁడు 'హిందీ భాగవత' కర్త. 'తాన్సేను' సూరదాసు నెక్కువగఁ బ్రేమించెడు వాఁడు. జీవితాంతము 'తాన్సేను' గురుభక్తిని సక్రమముగ నిర్వర్తించెను. తండ్రియైన 'మకరందుని' సేవించెను. సంగీత ప్రపంచమునఁ 'దాన్సేను' పేరు చరిత్రకారులు సువర్ణాక్షరములతో వ్రాసిరి.

ఒకసారి 'తాన్సేను' బృందావనమునంకలి 'విఠలనాథు' లను భక్తులను సేవింపనేగెను. విఠలనాథులుగూడ గొప్ప గాయకులు. వారియెదుటఁ 'దాన్సేను' దన గానమును బ్రదర్శించినాఁడు. వా రెంతయో సంతసపడి పదివేల

రూప్యముల నొక మూటగట్టి సార్వభౌమ గాయకుని ముందు బెట్టిరి. వానిలో నొక గవ్వయు నుండినది.

'తాన్సేను' జిఱునగవుతో నామూటను వారియెదుటనే విప్పినాఁడు. అందునఁ బదివేల రూప్యము లున్నవి. 'తాన్సేను' దృష్టి వాని జతలో నున్న గవ్వపైఁ బడినది. అతఁ డనెను: "స్వామీ! పదివేల రూప్యములు నా కర్థమగుచున్నవి. వాని జతలో నీగవ్వ నెందులకుఁ జేర్చితిరి? దయచేసి సెలవిత్తురా!"

విఠలదాసులు జిఱునవ్విరి. వా రన్నారు "లోకదృష్టితోఁ జూచినపుడు నీవు జాల గొప్పవాఁడవు. మహాగాయకుఁడవు. లోకదృష్టితో నీయొక పాటకుఁ బదివేల రూపాయల వెల. కాని విరక్తులు, భగవద్భక్తులగువారి కీర్తితోఁ బోల్చినపుడు నీకీర్తియుఁ, బాండిత్యమును గవ్వతో సమానమైనవి." ఈ మాట లనుచునే వారు దమ శిష్యులైన 'గోవిందదాసుల'ను గానముసేయుమనిరి. వెంటనే గోవిందదాసు లద్భుతముగఁ బాడినారు. వారు విరక్తులు.

విఠలదాసుల వాక్యములు 'తాన్సేను' హృదయపుఁగన్ను దెఱచెను. గోవిందదాసుల సంగీతమునకుఁ 'దాన్సేను' ఒడలు మఱచెను. ఆనాఁటినుండి యాతనికి లోకసన్మానమసహ్యమై పోయినది.

'తాన్సేను' విరక్తుఁడై తన చరమదినములను 'బృందావనము'ననే కడపెను. అతని భక్తి యుదారమైనది. అతని సంగీతము లోకోత్తర మైనది.

# ౪. శిశుపాలుఁడు

శ్రీకృష్ణునకు 'సాత్వతి' యను నొక మేనత్త యుండెను. ఆమె భర్త దమఘోషుఁడు. వాఁడు 'చేది దేశము'నకు రాజు. వారిద్దరకుఁ గలిగిన కుమారుఁడే శిశుపాలుఁడు. వీఁ డతివికృతాకారుఁడు; పరమ దుర్మార్గుఁడు. వీనికి జననకాలమున లలాటనేత్రమును, చతుర్భుజములు నుండినవి. ఈ విడ్డూరపు సంతానమును గని, తల్లిదండ్రుల కొకవంక భయము, మఱియొకవంక నాశ్చర్యము.

శిశుపాలుని జననసమయమున నశరీరవాణి సాత్వతి నుద్దేశించి యిట్లు పలికెను: "సాత్వతీ! నీ కుమారుఁ డతి బల పరాక్రమవంతుఁడు. వీనిని జయించుట కెవ్వరికిని సాధ్యముగాదు. కాని, యొక రహస్యమును వినుము. ఈ బాలుని నెవ్వరెత్తికొన్నపుడు వీని లలాటనేత్రమును, రెండు బాహువులు దుసిసిపడునో యా పురుషుఁడే వీనికి హంత. జాగ్రత్తగా సంరక్షించుకొనుము." ఈ మాటలు సాత్వతికి వజ్రప్రహారమైనవి. ఆనాఁటినుండి యామె ప్రతియొకరిచేతను దన సుతుని నెత్తికొన నిచ్చెడిది. ఈ శిశుపాలున కెవ్వఁడు మరణకారకుఁడో తెలిసికొనవలె నని యామె యాశ. కన్నకడుపుయొక్క మరు లటువంటిది.

కొన్నిదినములకుఁ దరువాత బలరామకృష్ణులు తమ మేనయత్తను జూడవచ్చినారు. వెంటనే సాత్వతి బలరాముకుఁ దన కుమారు నందించెను. శిశుపాలుని యుపయువ

ములయుం దేమార్పును రాలేదు. తరువాత మేనయత్త యభ్యర్థనతోఁ గృష్ణుఁడు శిశుపాలు నెత్తికొన్నాఁడు. కృష్ణుని చేయి దాఁకినంతనే శిశుపాలుని మూఁడవ కన్ను దునిసిపడినది; వాని రెండు బాహువులుగూడ విఱిగిపడెను. శిశుపాలుఁ డపుడు లోకపుసాటి పిల్లవాఁ డైనాఁడు. శ్రీకృష్ణుఁడే తన సంతానమునకు మారకుఁ డని సాత్వతి గ్రహించినది. ఆమె కృష్ణు నిట్లు ప్రార్థించెను: "వాసుదేవా! వీఁడు నీ మేనమఱఁది. వీఁ డొకవేళఁ గుపథముల యందుఁ బ్రవర్తించి, నీ కనిష్టుఁడైనను వీనిని నీవు దయతోఁ జూడవలెను."

అత్త యాడిన మాటలకుఁ గృష్ణుఁడు జిఱునవ్వు నవ్వినాఁడు. అతఁ డనెను: "అత్తా! జన్మాంతమువఱకు వీఁడు నాయెడ నపరాధములనే కావించుచుండిన నేను మాత్ర మెట్లు సహింతును? నాకుమాత్రము గోపతాపములు లేవా? ఏదైన నొక యవధి బెట్టుము."

కృష్ణుని యాప్రార్థనమునకు సాత్వతి యంగీకరించినది. "నూఱుతప్పులవఱకును శిశుపాలుని సహింపవలసిన" దని యామె హద్దుపెట్టినది. వాసుదేవుఁ డామె యేర్పాటున కంగీకరించెను. శిశుపాలుఁడు పెద్దవాఁ డైనాఁడు.

వాని దుర్మార్గములకు మితియే లేకుండెను. వాఁడు మహర్షులను హింసించును. సాధువులను భంగపెట్టును. పతివ్రతల నలయించును. సాటిక్షత్రియుల నవమానించును. వారందఱుఁ బోయి కృష్ణునితో మొఱలిడుచుండిరి. ఆతఁ

డేమియుఁ బలుకుట లేదు. సాత్వతికిఁ దానొసఁగిన వచనమున కాతఁడు గట్టువడియుండెను.

ఆనాఁడు విదర్భాధిపతి భీష్మకుఁడు. అతని తనూజాత రుక్మిణి. ఆమె లక్ష్మీదేవి యవతారము. రుక్మిణికొక యన్న గలఁడు. వాని పేరు రుక్మి. వానికి వాసుదేవునిపై నకారణ ద్వేషము. రుక్మిణికి వివాహయోగ్యమగు వయసు వచ్చిన వెంటనే రుక్మి యామెను శిశుపాలున కివ్వఁదలఁచి సన్నాహములు జేసినాఁడు. రుక్మిణికిఁ గృష్ణునిపై మనసు. అందుచే నామె యాదవోత్తమునకు రహస్యసందేశ మంపినది. ఆమె మాట వెంబడి జనార్దనుఁడు వచ్చి స్వయంవర రాజుల జయించి, రుక్మిణిని గైకొని వెడలిపోయెను. తనకు నిర్దేశింపఁబడిన కన్యకను గృష్ణుఁడు గ్రహించెనని శిశుపాలున కొండలు మండినది. వాఁడు నాఁటనుండి కృష్ణునిపై సాక్షాత్తుగ ద్వేషమునకుఁ బూనికొనెను. యాదవులపైనను, గృష్ణునిపైనను వాని యపకారములు లెక్కకు మీఱెను.

ఒకమాఱు కృష్ణుఁడు ప్రాగ్జ్యోతిషముపై దండెత్తి వెళ్ళినాఁడు. అపుడు 'భగదత్తు'నిపై యాదవసార్వభౌముఁడు యుద్ధమును బ్రకటించియుండెను. సమస్త సైన్యములును 'భగదత్తుని'పై సంగ్రామమునకుఁ దఱలినవి. కృష్ణుఁడు రాజధాని వదలిన వృత్తాంతము శిశుపాలునకుఁ దెలిసినది. వెంటనే వాఁడు ద్వారకపైఁ బడి, యూరంతయుఁ దెగఁ గాల్చినాఁడు. స్త్రీబాలవృద్ధులను దయలేక నఱకెను. ఒకసారి యాదవులు రైవతక పర్వతమునకు విహారమునకై

యేగియుండిరి. వారు స్త్రీలతోఁ గూడి విలాసముగ నుండిరి. మైరేయపానమున మత్తుగ్రమ్మి జాగ్రత్త దప్పియుండిరి. ఈ వృత్తాంతమును విని శిశుపాలుఁడు సైన్యముతో రైవతకాద్రిని జుట్టుముట్టెను. ఒడలు మఱచినవారి నందఱిని నిష్కరుణుఁడై చంపెను. వసుదేవుఁ డశ్వమేధమును జేయుచుండగా నాగుఱ్ఱము నపహరించి, యజ్ఞమునకు విఘ్నము నాపాదించినాఁడు. 'బభ్రుఁ'డనువాని భార్యను బలవంతముగఁ దనకు భార్యగాఁ జేసికొనెను. ఈ యపరాధములన్నియును గమలోదరుఁడు సహించినాఁడు. ఇఁకను వాగ్రూపములైన యెన్ని యపరాధములనో వాఁడు గావించినాఁడు. అన్నిఁటికిని క్షమాపణమే కృష్ణునినుండి వాఁడు బొందిన ప్రత్యుపకారము. కృష్ణుఁడు క్షమించు కొలఁదియు వాని దుండగములు రెండింత లయ్యెను. సాత్వతీదేవి బెట్టిన హద్దును వాఁ డెన్నఁడో దాఁటెను.

ఆకాలమున ధర్మరాజు రాజసూయము నారంభించినాఁడు. ఆయజ్ఞమునకు ధరణీమండలమునఁ గల క్షత్రియులందఱును వచ్చిరి. శిశుపాలుఁడుగూడ నరుగుదెంచినాఁడు. 'రాజసూయ'మున క్షత్రియ కులాలంకారుఁడగు నొక గొప్పవానికిఁ బూజ జరుగవలసియుండెను. అక్కడఁ జేరిన క్షత్రియులలో 'వీరపూజ' కర్హుఁ డెవ్వఁ డను విచారము బయలుదేఱినది. శ్రీకృష్ణపరమాత్మ యీపూజ కైకొనుట కర్హులని భీష్ము లనిరి. చేరిన రాజలోక మంతయు జ్ఞానవృద్ధుఁడు, వయోవృద్ధుఁడు నగు గంగాసుతుని పలుకుల కంగీకరించినది. 'వీరపూజ'కై కృష్ణుని ధర్మరా జాహ్వానించి

నాఁడు. ఈ సన్నివేశము శిశుపాలునకుఁ గంటకమైనది. వాని కటము లదరెను. రోషమున వాఁడు సభ నదలించినాఁడు. ఇట్లు హుంకరించినాఁడు: "కృష్ణుఁడు యాదవుఁడు. యాదవులకు సింహాసనాధికారమే లేదు. వారు క్షత్రియులే కారు. కృష్ణునికన్నను వయోవృద్ధులీ చేరిన సభయం దెందఱో కలరు. వాఁడు గుణహీనుఁడు. పెక్కుమందితోఁ గాఁపురము సేయు కాముకుఁడు. అట్టి నిర్గుణున కీసదస్సునఁ బూజగావించుట క్షత్రియజాతి కంతయు నవమానము. అమాన్యుఁడగు నీ వాసుదేవు నిట నుండనీయఁ గూడదు. వీఁడు క్షత్రియులలోఁ గూరుచుండుటకుఁ గూడ నసర్హుఁడు".

భీష్ములు శిశుపాలున కుత్తరమివ్వఁబోయిరి. వారి నాఁతడు దూలనాడెను. భీష్ముఁడు మోహాంధుఁ డని గర్దించెను. 'ముదిపెట్టి' యని యెకసక్కెమాడెను. పాండవుల నవివేకు లని నిందించెను. పాండవుల సభయందు శిశుపాలుని ప్రవర్తన మసహ్యము, అగౌరవకరముగ నుండెను.

అపుడు గృష్ణుఁడు సభికుల కందఱికిఁ దాను సాత్వతికొసఁగిన ప్రతిజ్ఞను వర్ణించి చెప్పెను. శిశుపాలుని దుండగములు నూటిసంఖ్యను దాఁటిపోయినవని సోదాహరణముగ వివరించెను. వివరించి, యందఱ నొప్పించి, యఖర్వవిక్రమమునఁ జక్రాయుధముతో వాని తలఁ ద్రుంచెను. మహాపచారమున శిశుపాలుఁడు ప్రాణములు వోఁగొట్టుకొనెను.



# ౫. మహాకవి పినవీరభద్రుఁడు

ఆంధ్రమహాకవులలో నియోగు లెక్కువ. వారు కలమును, ఖడ్గమును సమానముగ నాదరించిన మహానీయులు. ఆంధ్రభాషాయోషకు గొప్ప సేవ లొనరించిరి. తెనుఁగు దేశమున హరిహరావతారుఁడై జన్మించిన తిక్కన మహాకవి నియోగియే. ఆతని పేరు దలఁచికొనని దాంధ్రులకు నిలువ నీడయే లేదు.

పూర్వకాలమున రాజులకడ నియోగులు మంత్రులై వ్యవహారములఁ దీర్చిరి. దండనాథులై కత్తిఁబట్టి కదన రంగమున ఖడనుద్రొక్కిరి. కరణములై లెక్కలను వ్రాసిరి. కర్షకులై హలముబట్టి, భూమిని బ్రద్దలుగొట్టి, పండించిరి. మన చరిత్రలో వారు సేయని దేమున్నది?

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు నియోగి. గాదయామాత్యునకుఁ బుత్రుఁడు. పినవీరభద్రున కొక యన్న యుండెను. ఆతని పేరు బెదవీరన. ఆతఁడు 'సాళ్వగుండ' నరపాలుని కడఁ గొలువునందుండెను. సాళ్వగుండ నృసింహనృపాలుఁడు ప్రసిద్ధమైన విజయనగర సామ్రాజ్యమునకుఁ జక్రవర్తి. చాలఁ బరాక్రమవంతుఁడు.

పినవీరభద్రుఁడు భారతీతీర్థులకు శిష్యుఁడు. భారతీతీర్థులు శృంగేరీ పీఠమున గురువులుగ నుండిరి. విద్యానగర సామ్రాజ్యమును స్థాపించిన విద్యారణ్యమహర్షి యీ పీఠమునకు మూలపురుషుఁడు. అందుచే విద్యానగరరాజులు

వీరి నతిగౌరవమున మన్నించుచుండిరి. పినవీరభద్రుఁడు భారతీ తీర్థులకడ విద్యాభ్యాస మొనరించి, సమస్త శాస్త్రముల యందు నఖండుఁడై నాఁడు. 'శారదామంత్రము'నుగూడ భారతీతీర్థులే పినవీరభద్రున కనుగ్రహించిరి. అపారమగు గురుకరుణావిశేషమునఁ బినవీరభద్రున కుపాసన యద్వితీయముగ సిద్ధించినది. మంత్రజపముచేతఁ బ్రీతయైన శారదాదేవి యాతఁడు బిలచిన 'నో' యనుచుండెడిది. ఈ యుపాసనము నాతఁడు రహస్యముగ సాధించికొనెడివాఁడు. అందుచే నాతని శక్తియుక్తు లెవ్వరికి నంతగాఁ దెలియవు. తెలియఁగూడదనియే యాతని యూహ. పినవీరభద్రుఁడు సాళ్వనరసింహుని యాస్థానమునఁ గవిగా నుండెను.

పినవీరభద్రుఁ డుపాసకుఁ డని యెవ్వ రనుకొనరు. అతఁడు బ్రొద్దున లేచి స్నానము సేయఁడు. విభూతి ధరింపఁడు. నిష్ఠతో సంధ్య వార్వఁడు. ఒకరోజు స్నానము జేసి యన్నము దినును; మఱియొకనాఁ డట్లే తినును. సర్వకాలములయందును వీణసేవనమున నాతనిదంతము లెఱ్ఱబాఱియుండెడివి. జందెములు నల్లగా నుండెడివి. అంద ఱాతని నొక యాచారహీనునిగా భావించుచుండిరి. వారి యూహలకుఁ దగినట్లే యాతఁడు మెలఁగుచుండెను. భగవంతుఁడు హృదయగతమైన ప్రేమభక్తికి లోఁబడియుండును. బాహ్యాచారముల కాతఁడు మురియఁడు. హృదయమందు భక్తి నిశ్చలముగనున్నపుడు బాహ్యాచారము లుండవచ్చును; ఉండకయుఁ బోవచ్చును. ఈ రహస్యమును బినవీరభద్రుఁడు

బాగుగ నెఱుఁగును. బాహ్యాచారములపై నెక్కువ దృష్టి యిడినఁ దన్ను నిందించుచుండినవారెల్లరుఁ గేవల నటకు లనియు, వారికి దైవతత్వ మర్థము గాలేదనియు నాతనికి గఁటుతే. తన్నెవరైన "స్నానము జేసుదే" మని యడిగి నపు డాతఁడు నవ్వేడువాఁడు. అందఱు సంధ్యవార్చు చున్నపు డతఁడు మఱేపనియో చేయుచుండును.

పెదవీరనకుఁ దమ్ముని ప్రవర్తనము బాధాకరముగ నుండెను. నాటి బ్రాహ్మణు లెల్లరుఁ దన తమ్ముని ప్రవర్తన మును వ్రేలుబెట్టి చూపించుచుండిరి. కాని పెదవీరనభార్య తెలివిగలది. ఆమెకుఁ బినవీరనహృదయధర్మము దెలియును. ఆ వనితామణి బెదవీరనకుఁ గలిగిన దుర్భావమును బోఁ గొట్టుటకై యపుడపుడు బ్రయత్నించుచుండెను.

ఒకనాఁడు బెదవీరన సంధ్యవార్చుచున్నాఁడు. సంధ్య వార్చుచునే యాతఁడు దన భార్య కేమిసొమ్ములు జేయింప వలెనో యాలోచించుకొనుచుండెను. ఆ సమయమునఁ బిన వీరన బయటినడవలో నేమో పని చూచుకొనుచుండెను. ఇంతలోఁ బెదవీరన కొఱకై యెవరో వచ్చి బయటనుండి

వారికి నడవలో నున్న పినవీరన యిట్లు సమా ధానము జెప్పెను: "మా యన్నగారు మా వదినె కేమి సొమ్ములు జేయింపవలెనో యాలోచించుచున్నారు. కొంచెముసే పాగుఁడు. తొందరలో వతురు."

# మహాకవి పినవీరభద్రుఁడు

తమ్ముఁడు జెప్పిన యీ సమా... బడినది. అతని నెవ్వరో 'కొరడా' గైకొని కొట్టినట్లు లయ్యెను. "తన మనస్సులో జరుగుచున్న యీ యాలోచనాప్రవాహమును దమ్ముఁ డెట్లు గ్రహించెను! ఓహో! వీనియందుఁ బరహృదయమును గ్రహించు శక్తి యున్నది. నే ననుకొన్నట్లు వీఁడు భ్రష్టుఁడు గాఁడు. అంతస్సారము గలిగిన యొక యోగి." నాఁటినుండి తమ్ముని విషయమున నన్న ప్రవర్తనము మాఱినది. అతఁడు బినవీరభద్రునిఁ బ్రేమతో, గౌరవముతోఁ జూడసాగెను.

సాళ్వనరసింహుఁడు దన కంకితముగా నొక కావ్యమును వ్రాయవలెనని పినవీరభద్రు నడిగినాఁడు. అట్లే వ్రాయుదు నని మహాకవి యంగీకరించెను.

మహారా జాతనికిఁ గర్పూరతాంబూల మొసఁగినాఁడు. మహాకవి నిశ్శంకుఁడై దానిని బట్టినాఁడు. ఆ సమయమునఁ బెదవీరన యక్కడ నేయున్నాఁడు. తమ్ముఁడు గావ్యము రచించునని యన్నకుఁ బరమ సంతోషము. గ్రంథమును ముగించుటకై సాళ్వనరసింహుఁడు గొన్ని మాసములు గడువు బెట్టినాఁడు. అంతలోపలఁ గావ్యరచనము బూర్తి గావలెను. పినవీరన దానికిని అంగీకరించినాఁడు.

మఱుదినమునుండి పినవీరన్న కాచింతయే లేదు. నిర్విచారముగాఁ దిని తిరుగుచుండెను. ఊరియందున్న యితరవిద్వాంసులెల్ల "ఈసారితోఁ బినవీరనకు 'శృంగభంగ'మవు"నని లోలోన సంతోషపడుచుండిరి. ఒక్కొక్క

దినము గడచుకొలఁదియుఁ 'బెదవీరన'గుండె బరువెక్కు చుండెను. రాజదండన మీఁకఁ దమ్మునికిఁ దప్పదని పెదవీరన నిర్ణయించుకొని కన్నీళ్ళపర్యంత మైనాఁడు. ఇంతలో గడువు దినములును గడచిపోయినవి. మఱుదినమునఁ గావ్యమును రాజసభలోఁ బ్రదర్శింపవలెను.

ముందటిరోజు సాయంకాలమునఁ బినవీరభద్రుఁడు నిండార స్నానము గావించినాఁడు. వదినెతోఁ జెప్పి యొక గదిని శుభ్రముగ నలికించెను. ఆ గదియందు గంటము, దాటాకులును జేర్చినాఁడు. దీపము వెల్గించినాఁడు. వదినెతోఁ బినవీరభద్రుఁ డన్నాఁడు: "అమ్మా! నే నీరాత్రి యంతయు నీగదిలోఁ గూర్చుండి గ్రంథరచనమును గావింతును. గదివాకిలిని బంధించికొని కూర్చుందును. ఈ గది సమీపమున కెవ్వరును రాకుఁడు. నే నీరాత్రికి భోజనము సేయను. అన్ననుగూడ దయచేసి, యీగదికడకు రావల దని చెప్పుఁడు." వదినె పినవీరభద్రుని మాటల కంగీకరించినది. పెదవీరన వచ్చినవెంటనే యామె తమ్ముని వాక్యము లాయనకుఁ జెప్పి, యీగదివైపునకుఁ బోవల దన్నది. తన మఱఁది శారదాదేవి యుపాసకుఁడని యామె యెఱుఁగును.

అన్నకుఁ దమ్మునిప్రవర్తన మేమియు నర్థముగా లేదు. మాటిమాటికి గదిదగ్గఱకుఁ బోవును. భార్యచే బాధింపఁబడి వెన్కకు వచ్చును. గదిలోనుండి గాజుల గలగలధ్వని యొక నిముస మాగక వినవచ్చుచుండెను. ఆధ్వనితోఁ బెదవీరన

యుత్సుకత యింకను నినుమడించును. అతఁడు 'గదిలోనికిఁ దొంగిచూచెద'నను. భార్య వలదనును.

ప్రత్యూషమున కింకఁ గొంతకాలమే మిగిలియుండెను. పెదవీరన దన యుత్సాహము నాపికొనలేకపోయినాఁడు. భార్య 'వలద'ని యెంత వారించినను వినలేదు. పెదవీరన పోయి, తలుపులోని చిఱు రంధ్రమున గదిలోనికిఁ దొంగి చూచెను. అతని కనులు మిఱుమిట్లుగొన్నవి. లోన నొక నవయౌవనాంగి యున్నది. ఆమె సౌందర్యము లోకాతీతమై యుండెను. గాజుల గలగలలతో నామె కావ్యరచనము సేయుచున్నది. పినవీరన ధ్యానస్తిమితుఁడై కూర్చొని యున్నాఁడు.

ఆమెయే సరస్వతీదేవి. ఆ గీర్వాణి స్వయముగాఁ బినవీరనకై కావ్యరచనము సేయుచున్నది.

పెదవీరన తొంగిచూచుటయేతడ వామె యాసనము నుండి లేచినది. పినవీరన ధ్యానమునకు విఘ్నమైనది. "ఇప్పుడే యెందుకు లేచితి" వని వాగ్దేవి నడిగినాఁడు. "బావగారు చూచుచున్నా"రని యామె బదులువలికెను. మఱునిముసమున సరస్వతి యటలేదు.

గ్రంథము ముగియుట కింకఁ గొంత కొఱఁత యుండి నది. ఆ మిగిలిన భాగమును బినవీరన దెల్లవాఱులోపలఁ బూర్తిచేసినాఁడు. గడువులోపల గ్రంథరచనము ముగిసి

నది. పినవీరన గ్రంథమును గైకొని యాస్థానమునకు వచ్చి నాడు.

పినవీరభద్రుని యవమానమునకై కాచికొన్న విద్వాంసులకు నోటిలోఁ గరక్కాయ పడినది. వారి మొగములు దెల్లనయ్యెను. సాళ్వ నరసింహుఁడు సంతోషించి యాకవి కమూల్యములగు మరియాద లొనరించెను.

ఆగ్రంథముపేరే 'జైమినీ భారతము.' దానిని గృతి గొనుటతో నరసింహ భూపాలుఁడు ధన్యుఁడైనాఁడు. ఈ పినవీరభద్రుఁడే ''వాణి నా రాణి'' యని సగర్వముగఁ జెప్పికొన్నది.

## ౬. కవి సన్మానము

ఆంధ్రరాజులకుఁ గృష్ణదేవరాయలు మకుటమువంటి వాఁడు. అతఁ డమితపరాక్రమశాలి. గజపతుల కాతఁడన్న భయము. నరపతు లాతని కరిగాపులు. హయపతు లారాయనివైపు దేరిచూడ వెఱచుచుండిరి. ఆ కాలమున నీ ముప్పురును బ్రసిద్ధులైన రాజులు. ఈ ముప్పురిని గృష్ణ రాయఁడు జయించుటచే నాతనికి 'మూరురాయర గండఁ' డను బిరుదు గలిగెను.

రాయలకాలమున 'విద్యానగరసామ్రాజ్య' ముత్తరమున 'వింధ్యముల' వఱకును వ్యాపించినది. దక్షిణమునఁ

'గన్యాకుమారియే' దానికి ఎల్ల. తూర్పుఁబడమరలందు విశాల జలధులే రాయల సామ్రాజ్యమునకుఁ గాపు. రాయల సామ్రాజ్యమున నఱువది రేవుపట్టణము లుండినవి. వాని మూలమున విదేశీయ వ్యాపారము లెస్సగ సాఁగుచుండినది. పశ్చిమదేశములనుండి పెక్కుమంది రాయబారు లాతని కాలమున వచ్చిరి. వచ్చినవా రెల్లరు "విద్యానగర సామ్రాజ్యము భూలోకమున నున్న స్వర్గఖండ" మనియే పొగడిరి.



ఆతని సామ్రాజ్యమున సంపద యఖండముగ నుండెను. విద్యానగరమునందు రత్నములను వీథులలోఁ బోసికొని యమ్ముచుండిరఁట!

రాయలకడ సాళ్వతిమ్మరుసు మహామంత్రి. ఇతఁడు రాయలను జిన్ననాఁటినుండి పుత్రప్రేమతోఁ బెంచెను. అందుచే రాయ లీతని 'నప్పాజీ' యని పిలచెడివాఁడు. రాయల యఖండవైభవమునకు సాళ్వతిమ్మరుసునీతి శక్తియే కారణమని సమకాలికులైన విదేశరాయబారులు వ్రాసిరి.

కృష్ణరాయలు పరాక్రమముగల చక్రవర్తియే కాదు. అనేక భాషలయందుఁ బాండిత్యము గలిగిన పండితుఁడు గూడ. సంస్కృతమునం దాతఁ డనేక గ్రంథములను వ్రాసి

నాడు. ఆంధ్రమున రాయ 'ఆముక్తమాల్యద' యను మహాప్రబంధమును రచించెను. ఆ గ్రంథము మహా కఠిన మైనది. ఆ పుస్తకమును జదివినవారికి రాయల కెన్ని విషయములయం దెంతెంత పాండిత్య ముండెనో బోధపడఁ గలదు.

రాయలకు సాహిత్యమునందే కాక, సంగీతమునందును గొప్ప పాండిత్య ముండెడిది. అతఁడు వీణె నద్భుతముగ వాయించెడువాఁడఁట!

ఇన్ని యోగ్యతలు గలవాఁడుగనుకనే కృష్ణరాయల కొలువుకూట మనేకవిద్వాంసులతోఁ గలకలలాడుచుండెను. ఆఱు శాస్త్రముల నాపోశనముపట్టిన ప్రచండపండితు లా సభయం దుండిరి. సంగీతమున ఱాళ్లు గరఁగింపఁగల గాయకుల కాసభ బట్టుగొమ్మ. భాషాయోషకుఁ గ్రొత్త యుడుపు లను దయారుచేయు మహాకవు లాకొలువుకూటమునఁ గొల్లలుగ నుండిరి. ఆంధ్రకవులే కాక కన్నడకవులు, తమిళ కవులుగూడ రాయల యాస్థానమున గౌరవమందుచుండిరి. ఈ యన్నిభాష లాతనికి వచ్చును. పార్సీ, ఉర్దు మొదలైన భాషలయందుఁగూడ నాతఁడు వ్యవహారము నెఱపెడివాఁడు.

రాయల సభలో 'నష్టదిగ్గజము' లని యెనిమిదిమంది యాంధ్రకవు లుండెడివారు. వీరందఱిలోనను పెద్దనామాత్యు లన్నిటను బెద్దవారు. వారివంటివారే ముక్కుతిమ్మనగారును. ఇఁకఁ దక్కిన దిగ్గజములుగూడ సామాన్యమైనవి గావు. ఒక్కొక్క యోగ్యత యొక్కొక్కరిలో విశేషముగ నుండె

డిది. రాయల కందఱిపైనను ఆదరాభిమానము లున్నను బెద్దనామాత్యులను విశేషముగఁ జూచెడివాఁడు. ఎందు కనఁగాఁ బెద్దనామాత్యులు వయోధికులు, విద్యాధికులు.

రాయల యాస్థానమున నున్న విద్వాంసులకు స్వాతంత్ర్యము మెండు. వా రొక్కొక్కసారి రాయల యానతికిఁగూడ ధైర్యమున బదులొసఁగుచుండిరి.

ఒకసారి రాయలు బెద్దనామాత్యులను మహాకావ్య రచనకై ప్రేరేచెను. వా రన్నారు: "నీకుఁ గావలసినపు డంతయుఁ గవిత్వము వ్రాయుటకు నాకు సాధ్యపడదు. నా కవితారచన కనేకోపకరణములు గావలెను. ఊయలమంచ ముండవలెను. నాయూహలను దెలిసి వ్రాయఁగల లేఖకులు గావలెను. నా పద్యములను మధుర రాగయుక్తముగ, నర్థమును దెలుపక గానము సేయఁగల గాయకులు బరివేష్టింపవలెను. ఆత్మకింపయిన భోజన ముండవలెను. రమణీయమగు స్వరూపముగల రమణీమణులు దెచ్చియిచ్చు కర్పూర తాంబూలము గావలెను. ఇన్ని సాధనములు గుదిరినపుడే కవిత్వము నాకు దొరకును!" రాయ లీ సమాధానమునకుఁ గోపపడలేదు. వారు జిఱునవ్వు నవ్వి 'యట్లేగాని' మ్మన్నారు.

తరువాత నెంతయోకాలము గడచెను. మరల రాయలు పెద్దనామాత్యులను గావ్యరచనకై యడుగలేదు. కృష్ణరాయల కెన్నివైభవము లున్నను భగవంతుఁడు సంతానమును బ్రసాదింపలేదు. ఈ చింత కృష్ణరాయలను దినివేయుచుండినది. సంతానప్రాప్తికై రాయ లెన్నియో

తీర్థయాత్రలు గావించినాఁడు. ప్రతి క్షేత్రమునందును శాస్త్రవిహితములైన యనేకదానములు గావించినాఁడు. బ్రాహ్మణులతో నెన్నియో పుణ్యకార్యములు జేయించెను. కాని, దైవము గన్నుదెఱువలేదు. లోకమున నన్నిసౌఖ్యములును నొక్కరికే యమరవు. అట్లమరించుట భగవంతుని యుద్దేశము గానేకాదు.

అమోఘవాక్కులైన కవుల యాశీర్వచనములనైనను దనకు సంతానము గలుగునేమో యను నొక యాస రాయలకుండెడిది. ఈ విషయము పెద్దనామాత్యులతోఁ జెప్పి నిర్బంధించు నిష్టముగూడ రాయలకు లేదు. కవుల స్వాతంత్ర్యము నేమాత్ర మరికట్టఁగూడదని వారితలఁపు. రాయల హృదయమున జరుగుచున్న కలఁతను పెద్దనామాత్యులు గనిపెట్టినారు. వారును దగిన సమయమునకై కాచికొని మహాకావ్యరచనమునకుఁ గావలసిన 'యనుకూలకథలు' వెదకుచుండిరి.

రాయలొకసారి గజపతులపై దండెత్తిరి. యుద్ధసమయములందుఁ గవులుగూడ వెంటఁబోవుచుండిరి. పైఁగాఁ బెద్దనామాత్యులు గత్తిబట్టి యుద్ధముసేయఁగలవారును. కృష్ణరాయలు దండయాత్రలోఁ గొన్నిదినములు 'విజయవాటి' కడ నున్న శ్రీకాకుళమున నాగినాఁడు. అక్కడనున్న దేవుఁ డాంధ్రవిష్ణువు. కొన్నిరోజు లాదేవునకు రాయలు సేవలుచేయ నిశ్చయించికొనెను.

ఒక 'హరివాసరమున' శ్రీకాకుళమునందుఁ గవి పండితసభ జేరినది. అందఱును రాయల యశస్సును వర్ణించి యాశీర్వదించినారు. పెద్దనామాత్యులుగూడ పద్యములు జెప్పి యాశీర్వదించిరి. అపుడు రాయలప్రక్కనే యున్న తాసనమునఁ గూర్చున్న మహామంత్రులు సాళ్వ తిమ్మరుసు రాయలచేఁ గర్పూరతాంబూలమును పెద్దనామాత్యులచేతఁ బెట్టించినారు. పెద్దనామాత్యులు జకితులై 'యప్పాజీ' వైపు జూచినారు. 'మహాకావ్యరచనకీతాంబూల'మని పలుకుచు, సాళ్వతిమ్మరుసు-మహామంత్రులు-గిలకిల నవ్విరి. మహామంత్రుల యాజ్ఞ యందఱికిని సుగ్రీవాజ్ఞ. వారి ప్రేమ కున్న బల మట్టిది. వారి ధీశక్తిలోని పటిమ యట్టిది. వారి వయస్సుపై నందఱకున్న గౌరవ మట్టిది. హృదయమందమితముగ సంతోషపడిన రాయలు మహామంత్రులవైపు వికసితముఖమునఁ జూచినారు. పెద్దనామాత్యుల సంతోషమునకు మేరయే లేదు. వా రాదర మేదురముగ రాయలను జూచిరి.

ఆహా! స్వామిభృత్యసంబంధ మెంత సరసమైనది! పెద్దనామాత్యులు దొందరలోనే 'స్వారోచిష మను సంభవము' ముగించిరి. ఆ మహాకావ్య మన్నివిధముల నాంధ్ర కవులకుఁ దొడవై యుండెను. ఆ కావ్యమున, నిగూఢముగ, రాయలకుఁ బుత్రప్రాప్తి గలుగవలెనను నాశీర్వాదమును నుంచినది.

గజపతులతోడి యుద్ధము ముగిసినది. ప్రతాపరుద్ర గజపతి కృష్ణరాయలకుఁ బాదాక్రాంతుఁడైనాఁడు. పైఁగా

నాతఁడు దన బిడ్డ నొసఁగి రాయలకు వివాహమాచరించెను. కృష్ణరాయలను విజయలక్ష్మియు, గజపతి తనూజయగు లక్ష్మియు నేకకాలమున వరించిరి. రాయలు విజయనగరమునకుఁ దిరిగివచ్చినారు. విద్యానగరములోని 'ప్రజ' యీ వైభవమున కానందముతోఁ బొంగిపోయెను. విజయోత్సవములు సామ్రాజ్యమున నెన్నిదినములో సాఁగినవి.

'స్వారోచిషమనుసంభవ' మును వ్రాసిన పెద్దనామాత్యుల నుచితరీతిని రాయలు గౌరవింపఁదలఁచినారు. ఈ విషయమును వారు మహామంత్రుల చెవిలోఁ గూడ వేసిరి. వారు 'కానిమ్ము'న్నారు.

విద్యానగరమంతయు నానాఁడు సుందరముగ నలంకరింపఁబడెను. గడిదేశమండలివారుదప్ప దక్కిన యందఱు మహామండలేశ్వరులును రాజధానికి రావింపఁబడినారు. వీథులెల్లను గస్తూరిచేఁ జిలుకఁబడినవి. రాచనగరంతయు నాణిముత్యములచే నలంకరింపఁబడెను. కొలువుకూటము నవరత్నకాంతులతో జిగజిగలాడిపోయినది. సామ్రాజ్యమున నూఱుమూలపల్లెయందున్న మనుష్యులకుఁగూడఁ బెద్దనామాత్యుల సన్మానవిషయమై తెల్పఁబడెను.

ఆనాఁడు మహామంత్రులును, రాయలును దక్కిన కవులతోఁగూడ నల్లసాని పెద్దన యింటికి నడచివెళ్లినారు. త్రోవలో నిసుక వేసిన రాలని జనము. పెద్దనామాత్యుల యిల్లొక విశాలమగు నగరు.

బంగారు తగడులతో నలంకరింపఁబడిన యొక పల్లకి. దానియందు వ్రేలాడుచున్న ముత్యముల జాలరులు. నవరత్న

ముల పొదిగింపులు. ఆ పల్లకియందు రాయలు మహాకవులను గూర్చుండఁబెట్టిరి. రాయ లొకవైపు పల్లకిని బట్టిరి. వెంటనే మహామంత్రు లొకకొప్పుఁ బట్టికొనఁబోయిరి. పెద్దన మహామంత్రులకుఁ జేతులు జోడించి, వలదన్నారు. రాయలు మాత్రము కొన్ని యడుగులు బల్లకిని మోసినారు.

పల్లకి కొల్వుకూటమునకు వచ్చెను. మహాకావ్య పఠనము శాంతముగ సాఁగినది. పెద్దనపై నత్తరుల ముంపులు, ముత్తెములతోడి యభిషేకములు. రాయ లాతని కెన్నియో యగ్రహారముల నొసఁగెను. ఆహా! అట్టి విద్యాప్రభువు లున్నపుడు మహాకావ్యరచయితల కేమి కొదువ!!!

## ౮. రణతిక్కన

రణతిక్కనకే 'ఖడ్గతిక్కన' యని పేరు. మహాకవియై, భారతమును బదునైదు పర్వములు దెలిఁగించి యాంధ్రభాష కమూల్యసేవ గావించిన కవి తిక్కన కితఁడు దమ్ముఁడు. కవి తిక్కన సోమయాజిగూడ. అనఁగా, యజ్ఞము నొనరించినవాఁ డన్నమాట. ఈ యన్నదమ్ము లిద్దరును నెల్లూరు ప్రాంతములను బరిపాలించిన మనుమసిద్ధి రాజుకడ నుండిరి. మనుమసిద్ధి యాస్థానమునఁ గవి తిక్కన ప్రధానకవిగా నుండెను. ఆ రాజుకడ ఖడ్గతిక్కన ప్రధాన దండనాయకుఁడు. ఈ యన్నదమ్ము లిద్దరును సిద్ధిరాజునకుఁ గావించిన యుపకార మింతింత గాదు. తిక్కనామాత్యులు దమ యుత్తమములైన

రచనలచే మనుమసిద్ధి కీర్తి కొలఁపులు బెట్టినారు. ఖడ్గ తిక్కన దన యమోఘమగు ఖడ్గముచే సిద్ధిరాజు శత్రువులను జయించి, యా రాజునకు వైభవము జేకూర్చుచుండెను.

సిద్ధిరాజుగూడ నీ యుపకారమును మఱచినవాఁడు గాఁడు. అతఁడు దిక్కనామాత్యులను 'మామా' యని పిలుచుచుండెనఁట! రణతిక్కనపైఁగూడ మహారాజున కమిత గౌరవము.

ఒకానొకసారి యక్కన, బయ్యన లను వారు మనుమ సిద్ధిపై దండెత్తివచ్చిరి. వా రిర్వురును సిద్ధిరాజునకు దాయా దులు. వారి సైన్యము లనంతములుగ నుండెను. అందుచే వారు మనుమసిద్ధిని బారఁద్రోలి, యతని రాజ్యము నాక్ర మించికొన్నారు. అపుడు దన ప్రభువునకు రాజ్యమును సంపాదించిపెట్టుటకై కవి తిక్కన యోరుగంటికి బయలు దేఱినాఁడు. అప్పటి యోరుగంటి రాజు గాకతి గణపతి దేవుఁడు. అతఁడు దిక్కనామాత్యుల నెంతయో యాదరిం చెను. ఆ మహారాజునకుఁ దిక్కనామాత్యులు దమ భారత మును జదివి వినిపించిరి. ఆ రాజు పడిన సంతోష మింతింత గాదు. గణపతిదేవుఁడు దిక్కనామాత్యుల కనేక మర్యా దలు గావించినాఁడు. తమ ప్రభువుల రాజ్యము నక్కన, బయ్యన లన్యాయముగ నాక్రమించిరనియు, వారి నోడించి మనుమసిద్ధికి రాజ్యమిప్పింపవలె ననియుఁ దిక్కనామాత్యులు గణపతిదేవుని వేఁడికొన్నారు. మహాకవుల యభ్యర్థన కా యుదారుఁడగు గణపతి యంగీకరించి సైన్యములతో

వెంటనడచి వెలనాడు బ్రవేశించినాఁడు. అక్కన, బయ్యన లాతని ధాటి కాగలేకపోయిరి.

నెల్లూరియందు మనుమసిద్ధికి గణపతిదేవుఁడు బట్టము గట్టెను. అఱువది యెన్మిది పట్టణములకు మన్మసిద్ధి మరల నధీశ్వరుఁ డైనాఁడు. తిక్కనామాత్యులు మరల సూర్య వంశముయొక్క ఖ్యాతిని నిలిపిరి. మనుమసిద్ధి సూర్యవంశపు రాజుఁట!

ఈ యుపకారము నందిన నాటినుండి మనుమసిద్ధికిఁ దిక్కన యింటిపై నాదరము మితిమీఱినది. తిక్కనా మాత్యుల యడుగుల కాతఁడు మడుగులొత్తెడివాఁడు. తొల్లింటివలెనే మన్మసిద్ధి నృపాలుఁడు ధార్మికముగ రాజ్య మును బరిపాలించుచుండెను.

ఇంతలో మఱియొక బెడద వచ్చిపడినది. ఎఱ్ఱగడ్డ రాజగు గాటమరాజుతోను, బల్నాటిరాజు పద్మనాయకుని తోడను మనుమసిద్ధికి మైత్రి చెడినది. వారికిఁ బసువుల బీళ్ల విషయమున వివాదము వచ్చెను. కాటమరాజును, బద్మ నాయకుఁడు నొకటై, మనుమసిద్ధిపైఁ గత్తిగట్టినారు. వారు మనుమసిద్ధి రాజుయొక్క పసువుల నన్నిటిని దోలుకొని పోయిరి. 'పుల్లరి' చెల్లింపనిది పసువుల విడువమని వారి వాదము.

ఈ విషయమున మన్మసిద్ధిది సంపూర్ణముగ న్యాయ పక్షమై యుండెను. కాని, యాతని న్యాయమును వినువా రెవరు? కాటమరాజ ప్రభృతులు బ్రబలురై న్యాయమును ధిక్కరించిరి. ఇఁక వారిపైకి ధర్మయుద్ధమునకు సైన్యములు

నడపుట దప్ప వేఱుమార్గము విక్రమసింహాపురీ నృపాలునకు లేదు. మనుమసిద్ధి గొలువుదీర్చినాఁడు. ఒకవైపున పోటు మఱగిన వీరభటులు గత్తులూదికొని కూర్చుండియుండిరి. ఇంకొకవైపునఁ బేరెన్నికఁగన్న దండనాయకులు-వహ్నినైనను బుడిసిలింతమనువారు-వీరరసావతారులై పరివేష్టించియున్నారు. ఒకదిక్కున నుద్యోగు లధివసించియున్నారు. వేఱొకకడఁ దిక్కనామాత్యులు-భూమికి దిగిన కవితావతారము-గూర్చుండియుండిరి. సిద్ధిరాజిట్లు పలికెను: "వీరవరులారా! దండనాధులారా! పల్నాటివారు మన పసువులఁ బట్టినారు. సంగరము లేక సంధికై యెంతయో ప్రయత్నించితిని. వారు నా సామమును బలహీనతగ నర్థముజేసికొని, మీఁదిమీఁదికి వచ్చుచున్నారు. ఈ సమయమున మనకు యుద్ధమునకన్నను వేఱుమార్గము లేదు. శత్రువులు మహాప్రబలురు. వారిని మీలో నెవ్వరు జయింపఁగలరో తెలియవలెనని నా కోరిక."

సభయంతయు నింజమూకడినటు లుండెను. వెంటనే ఖడ్గతిక్కన లేచినాఁడు. "ప్రభూ! యేలినవారి యాజ్ఞయైనచో నేను బసువులను మఱలింతును. అడ్డుపడిన యరులను గత్తిఁ గండగా సంహారింతును." అన్నాఁడు. ఈ మాటకుఁ గవి తిక్కన శరీరము గగుర్పొడిచెను. అతని యుత్సాహమునకు మేర లేదు. వా రాసనమునుండి దిగివచ్చి తమ్ముని బిగ్గరఁ గౌఁగిలించికొన్నారు. సకలజన సమక్షమున ఖడ్గతిక్కనకు సర్వసేనాధిపత్యమునకై యభిషేకము జరిగినది.

మఱుదినమున రణతిక్కన యుద్ధభేరి వేయించెను. సైన్యము లుత్సాహమునఁ గదలినవి. కైజామోరల లాడించి గుఱ్ఱములు దాఁటులుగొట్టెను. ఏనుఁగుల ఘీంకారములతో దిక్కులు జెవుడువట్టినవి. వీరరాహుత్తులు 'జయము మాదే' నని జంకలు దాటించుచుండిరి. ఈ యన్నిసైన్యములను, నాయకుఁడై నిలచి ఖడ్గతిక్కన నడపెను.

అతని ఫాలతలమునఁ దన భార్య 'చానమ' యిడిన వీరకుంకుమ మూఁడవ కన్నుగా మెఱయుచుండెను. చానమ మహాపతివ్రత; వీరపత్ని. యుద్ధరంగమున కేగుచున్న భర్త నామె మనసార దీవించి పంపినది.

ఇరువాగులకును బెన్నానదియొడ్డున యుద్ధము నడచినది. వీరవరులు ప్రాణములు దాపక పోరుచుండిరి. ఎంత పోరినను శత్రుసైన్యము లధికముగ నుండుటచే ఖడ్గతిక్కనకు విజయము గడిఁదిగఁ గన్పించినది. మధ్యాహ్నపు మిడిమెండలు మొగమునకన్నుచుండెను. అతఁడు విపరీతముగ నలసిపోయినాఁడు. అతని సైన్యములును జాల నలసినవి. ఈ యదను జూచి శత్రువులు దఱిమిరి. సైన్యములు పరుగు మొగము బట్టినవి. ఖడ్గతిక్కన యుత్సాహహీనుఁడై నాఁడు. అతఁ డింటిత్రోవఁ బట్టెను. ఖడ్గతిక్కన వెనుదిరిగిన వార్త యపుడే పట్టణమున వ్యాపించినది. ఆ మాట 'చానమ' యెదకు 'బాకుపో'టైనది. ఖడ్గతిక్కన తల్లి ప్రోలమ. ఆమె హృదయముగూడ భగభగ మండెను. తాను 'వీరమాత'ను గాలేకపోయితినని యామెయమ వేదన. కవితిక్కనకు మొగముపైఁ గాటువేసిన నెత్తురుజుక్క లేదు.

ఖడ్గతిక్కన యింటికి వచ్చినాఁడు. ఇంటికి వచ్చుచున్న భర్తకు చానమ యెదురుబోలేదు. ఇంటిలోనికి వచ్చినను గుశలప్రశ్న వేయలేదు. ఈ వాలకము ఖడ్గతిక్కనకుఁ గ్రొత్తగ నుండలేదు. చానమ హృదయము నాతఁ డెఱుఁగును. ఆతని హృదయముగూడఁ బరాజయమున మండుచునేయుండెను. "భోజనము గావించి మరల యుద్ధమునకుఁ బోద" మని యాతఁడు నిర్ణయించికొన్నాఁడు.

ఖడ్గతిక్కన చానమతో "స్నానమునకు నీరు దోడవలసిన"దని చెప్పెను. ఆమె బదులు పలుకలేదు. వెళ్ళి భర్తకుఁ దానమునకై నీరు దోడినది. ఎవ్వరుఁ జూడకుండుటకై యొక మంచమునుగూడ నడ్డము బెట్టినది. ఖడ్గతిక్కన స్నానము జేయఁబోయెను. మంచ మడ్డముగఁ బెట్టఁబడియుండెను. లోపల నొక బసుపు ముద్దయు నున్నది. ఖడ్గతిక్కన కేమియు నర్థము గాలేదు. ఆతఁ డనెను: "చానా! ఇది యేమి యాగడము! నాస్నానమునకు స్త్రీలకువలె మంచ మేల అడ్డుపెట్టితివి? ఈ పసుపు ముద్ద యేమి?" ఆమె మొగము పైకెత్తి నాథుని వంకఁ జూచెను. ఆమె యెప్పుడును ఇంతకు మునుపు, భర్తపాదములవైపే చూచెడిది. నేఁ డామె భర్త మొగమువైపు జూచెను. చూచుచునే చానమ కన్నులనిండ నీరు దాల్చినది. ఆమె యన్నది: "ఈ యాగడమంతయు మీ దయయే. శత్రువులకు వెన్ను జూపి వచ్చినచో ఖడ్గతిక్కన యేటి వీరుఁడని వీరులు నవ్వరా? ఇంతకుమును పీయింటిలో నేనును, మీయమ్మయు నిద్దరే యాఁడువార మంటిమి. నేఁటినుండి ముగ్గురమైనాము.

ఇంక దిగు లెందుకు? ఆఁడువారివలెనే స్నానము జేయుఁడు.''
ఈ మాటలతో ఖడ్గతిక్కన ప్రాణము లెగిరిపోయినవి.
అతఁడు మౌనముగ నింటిలోనికిఁ బోయెను.

అమ్మ 'నన్నము వడ్డించు' మని యడిగినాఁడు. ఆమె వడ్డించెను. అంతమునఁ బెరుగు వడ్డించినది. పాలు విఱిగిపోయియుండుటచేఁ బెరుగు సరిగాఁ బేర లేదు. అందుచేఁ బెరు గరుచిగ నుండెను. ఖడ్గతిక్కఁడు దల్లి నడిగెను: ''అమ్మా! పాలు విఱిగిపోయిన వేమి?'' ప్రోలమ తనయుని వైపు జూచెను. ఆమెకను లెఱ్ఱవడియుండెను. లోకసంహార శక్తి చండీదేవి యాకన్నుల నుండినది. ఆమె యిట్లు గద్దించెను: ''నీవు శత్రువులకు వీపు జూపి విక్రమము విఱిగి వచ్చితివి. అందుచేఁ బసులు పరులకుఁ జిక్కి విఱిగినవి. ఇంకఁ బాలు విఱుగ కేటులుండును? మట్టసముగఁ దిని లేచిపొమ్ము!''

ఖడ్గతిక్కన యింక నటఁ గూర్చొనలేకపోయెను. కన్నతల్లి యన్నమాటలు హృదయమును దూసివేసినవి. తక్షణమే అతఁ డాకు విడిచి, ఖడ్గమును గైకొని ''నేఁడే శత్రుసంహార''మని యఱచుచుఁ బరువెత్తెను. అతని వెంటనే సైన్యము లురికెను. పోరు హోరాహోరి సాఁగెను.

ఎక్కడఁజూచినను, యుద్ధభూమిలో ఖడ్గతిక్కనయే ప్రత్యక్షమగుచుండెను. అతని కత్తి మెఱుపువలె మెఱయుచుండెను. శత్రువీరు లావిక్రమమునకుఁ దల్లడిల్లిపోయినారు. వాని ఖడ్గసృష్టికి సాధన సామగ్రియే నేఱుగానున్నటులుండె

నది. లయకాలుఁ డను కమ్మరి యాశక్తిని సృష్టించినటు లుండెను. ఖడ్గతిక్కన సంహారరుద్రుఁ డన్నటులుండెను.

గాయములతో ఖడ్గతిక్కన శరీరము జల్లెడయైనది. సూర్యాస్తమానమునకు సూర్యమండలమును భేదించికొని ఖడ్గతిక్కన ప్రాణము లెగిరిపోయెను. వాని మరణవార్త యూరిలోఁ దెలిసినది. చానము, ప్రోలములు సగర్వముగఁ దల యెతుకొని తిరిగిరి. కవితిక్కన వంశగర్వమును కలఁచి చిఱునవ్వినాఁడు.

## ౮. జంబుకేశ్వరుఁడు

పదునాల్గవ శతాబ్ది ప్రారంభమునాఁటి మాట. ఆనాఁడానెగొంది ప్రాంత మొక ప్రసిద్ధమైన రాజ్యము. ఆ ప్రాంతముల నానాఁడు 'గుంతలదేశ' మనుచుండిరి. ఆ కుంతలదేశమునకు జంబుకేశ్వరుఁడు పరిపాలకుఁడు. అతఁడు చాల ధర్మాత్ముఁడు. నల నహుష దిలీపులవంటివాఁడు. నల నహుషాదులవలెనే యాతఁడు రాజ్యము నేలుచుండెను. శరణాగతులను రక్షించుటలో జంబుకేశ్వరునకుఁ బెట్టినది పేరు.

జంబుకేశ్వరుని రాజ్యము 'దోరవాడి' మొదలు 'గురుగోడు' వఱకుండెను. దక్షిణమున 'హోలెతెకెరె' తాలూకాయంతయు నాతని రాజ్యములోనిదే. పశ్చిమమున 'దావణగిరి' 'హరిహర' ప్రాంతములు లోఁబడియుండెను. ఉత్తరమునఁ గృష్ణానది యాతని రాజ్యమున కెల్ల. ఇతని రాజ్యమున నేఁటి బళ్ళారి, చిత్రదుర్గము, రాయచూరు, ధార్వాడ జిల్లాలుగూడఁ జేరియుండినవి.

జంబుకేశ్వరుఁడు కరుణామయుఁడైనను శత్రుభీకరుఁడు. ఆ కాలమున నుత్తరమునుండి 'యవనులు' చాల సారులు దక్షిణముపైకి దండెత్తివచ్చిరి. ఒకసారి, 'మాలికాఫరు' దక్షిణముపైకి వచ్చినాఁడు. వాఁడు క్రూరత్వమునకుఁ బెట్టినది పేరు. వాఁడు 'దేవగిరి'ని జయించి, యా గ్రామమును గాల్చివేసెను. అటనుండి వాఁడు ద్రోనపాడువునను గ్రామములు గాల్చికొనుచు దక్షిణమునకు మరలినాఁడు. మాలికాఫరు 'కుమ్మటము' కోటను బట్టినాఁడు. ఆ కోట జంబుకేశ్వరుని రాజ్యములోనిది. దానిని వాఁడు ఆఱు దినములు బట్టినాఁడు. ఆకోట బడలేదు. కోటలోనుండి జంబుకేశ్వరుఁడు శత్రుభీకరపరాక్రమమునఁ బోరెను. మాలికాఫరు వెన్కకు మరలెను. వానిని జంబుకేశ్వరుఁడు దను 'యెల్లలు' దాఁటిపోవువఱకుఁ దఱిమెను. ఈరీతి జంబుకేశ్వరుఁడు బండ్రెండు సంవత్సరములు యవనసేనావాహినిని దక్షిణమునకు సాగనివ్వక యడ్డినాఁడు.

యవనులేకాక జంబుకేశ్వరుని కితరశత్రువులుగూడ నుండిరి. దక్షిణమున నున్న ప్రసిద్ధసార్వభౌములు 'గాకతి రాజు' లీతనికి వైరులు. వారు 'గుంతలము'ను గాఁజేయుటెప్పుడెప్పు డని కాచికొనియుండిరి. ఒకసారి, కోటికంటి రాఘవుఁడు కుమ్మటముపైఁ బడెను. ఇతఁడు గాకతి సామంతుఁడుగాఁ 'గద్వాలు' ప్రాంతము నేలుచుండెను. వానికిఁ గాకతి రుద్రుఁడు సాయము జేసినాఁడు. కాకతి రుద్రుఁడు 'బెండపూడన్న' మంత్రి నంపెను. వారిద్దరను

జంబుకేశ్వరుఁడు వెన్కకుఁ దన్నినాఁడు. ఆ యుద్ధమునఁ గుంతలేశ్వరుని బందుగు లెన్మిదిమంది జచ్చిరి.

నాఁడు గర్ణాటమును 'బల్లాణ' రాజు లేలుచుండిరి. బల్లాణుఁడు జంబుకేశ్వరుని జయింపఁగోరి 'దొరవాడి' దుర్గమును బట్టినాఁడు. అతనిని జంబుకేశ్వరుఁడు వెన్కకు దఱిమెను. అపజయముచేఁ గ్రుంగిపోయిన బల్లాణుఁడు మఱల 'కుమ్మటము'పైఁ బడినాఁడు. ఆసారిగూడ వానిని వలచిన దపజయమే. 'కుంతలము' లెక్కకుఁ జాల చిన్న రాజ్యము. కాని, జంబుకేశ్వరుని పరాక్రమముతో నది పెద్ద రాజ్యముగ భాసించెను. కుంతలేశ్వరుఁ డితర భూముల నాక్రమించుటకుఁ బ్రయత్నింపఁడు. తన రాజ్యమున నొక యంగుళపు మేర విడువఁడు. ఇది యాతని ధర్మదీక్ష.

ఢిల్లీలో 'తుగ్లకు' చక్రవర్తియైనాఁడు. వాని కానెగొందిపైఁ గన్నుబడినది. దానిని జయింప వాఁడెన్నియో సారులు యత్నించి విఫలుఁడైనాఁడు. విఫలుఁడగుఁ కొలఁదియు, వాని కానెగొందిపైఁ బట్టుదల రెండింతలగుచుండెను. ఈసారి వాఁడు దన సర్వశక్తులను వినియోగించి, 'కుంతలము'ను బట్ట నెంచినాఁడు. వాఁ డాదేశముపైఁ బడుట కొక సాకును వెదకుచుండెను. ఇంతలో నొక విషాద సంఘటన జరగినది.

తుగ్లకునకు 'బహాదురీ' అనునొక మేనయల్లుఁడు. వాఁడు దక్షిణమున 'సాగరు'నకు సార్వభౌమ ప్రతినిధిగ నుండెను. వాఁడు 'జులేఖా' యను పడఁతిని ప్రేమించియుండెను. ఆమె జహానారాయను నామె తనూజ. జహానారా 'కర్మాస్పుఁ' డను

సరదారుని భార్య. కర్మాస్సుఁ డొకసారి తుగ్లకుపైఁ దిరుగఁబడినాఁడు. తుగ్లకు, క్రౌర్యమునకుఁ బెట్టినది పేరు. వాఁడు 'కర్మాస్సుని' ఘోరముగ సంహరించినాఁడు. అంతటితో సార్వభౌముని పగ దీఱలేదు. కర్మాస్సుని కుటుంబము నాతఁ డాజన్మాంతము కారాగారమున బంధించి యుండెను. 'జులేఖా'ను ప్రేమించిన 'బహాదుద్దీను' రహస్యముగ నా తల్లి బిడ్డలను జెఱసాలనుండి విడిపించినాఁడు. వారిద్దఱిని వాఁడు దనవెంట 'సాగరు' నకుఁ దీసికొని వచ్చినాఁడు. 'తుగ్లకు'నకు బహాదుద్దీను జేసిన మోసము దెలిసినది. అతఁడు నేయి లేకనే మండెను. తుగ్లకు వెంటనే 'ఖాజాజహాను' బహాదుద్దీనుపై కంపినాఁడు. వీనికి బహాదుద్దీనుపై ద్వేషముండెను. వాఁ డింతకుముందు 'జులేఖా'ను ప్రేమించెను. వాని ప్రేమ కామె యంగీకరించి యుండలేదు. అందుచే వాని ప్రేమ మచ్చరముగ మాఱినది.

ప్రేమదగ్ధుఁడగు 'ఖాజాజహాను' బహాదుద్దీనుపైఁ బడెను. ఇరువురకును గోదావరీనదియొడ్డునఁ బోరు ఘోరముగ సాఁగినది. గౌతమీజలము మానవరక్తములచేఁ గొండగోగులరంగు దాల్చెను. ఆ యుద్ధమున 'బహాదుద్దీను' బూర్తిగ నోడినాఁడు. వాఁడు దక్షిణమునకుఁ బఱువెత్తెను. శరణాగతత్రాణ బిరుదు వహించిన జంబుకేశ్వరుని వాఁడు శరణుజొచ్చినాఁడు. కుంతలేశ్వరుఁడు వాని కభయ మొసఁగెను. వాని దారాసుతాదుల నాతఁడు దయతోఁ జూచెను. బహాదుద్దీనునకు శరణమొసఁగుటచేఁ దనకు యుద్ధము జరుగనున్నది ప్రచండుఁడగు తుగ్లకుతో నని జంబుకేశ్వరునకుఁ

దెలియును. అతఁడు సార్వభౌముఁ డనియుఁ, దా నొక చిన్న రాజనియు జంబుకేశ్వరునకుఁ దెలియును. తెలిసియు నాతఁడు బహాదుద్దీనును రక్షింప నంగీకరించెను. హైందవ రాజుల ధర్మప్రేమ యట్టిది!!

తుగ్లకున కీవార్త దెలిసినది. అతఁ డందుకే గాచి కొనియుండెను. బ్రహ్మాండ సైన్యముల నాతఁడు కుంతలముపై కంపినాఁడు. అవి జంబుకేశ్వరుని ఖడ్గధాటికిఁ బరాజితములై వచ్చినవి. మఱల రెండవసారి సైన్యములఁ దుగ్లకు బంపినాఁడు. వానినికూడ జంబుకేశ్వరుఁడు వెన్కకుఁ దన్నెను.

ఇఁకఁ దుగ్లకు రోషమునకు మితి లేకపోయినది, సామ్రాజ్యమునందలి సైన్యముల నన్నిటి నాతఁడు జేర్చికొనెను. తానే యీసారి సర్వసైన్యాధ్యక్షుఁడు. సేనలు ఢిల్లీ నుండి కదలినవి. చక్రవర్తిసైన్యధాటికి భూమి గజగజలాడినది. ఆసైన్యము నేలయీనినటు లుండెను.

చక్రవర్తి సైన్యములు వచ్చుచున్న వార్త కుంతలేశ్వరునకుఁ దెలిసెను. అతఁడు భయపడలేదు. అతనికడ వాహిని యున్నది కొన్నివేలు మాత్రమే. ఆ పరిమిత సైన్యమునే వెంటఁగొని జంబుకేశ్వరుఁడు చక్రవర్తి సైన్యములను మార్గమధ్యముననే యడ్డినాఁడు. లోకభీకరమగు యుద్ధము జరిగెను. శత్రుసైన్యముల నాపుటకు జంబుకేశ్వరున కశక్యమైనది. కుంతలేశ్వరుని సైన్యాధిపతి యా రణమున వీరస్వర్గ మందినాఁడు.

జంబుకేశ్వరుఁడు వెనుదిరిగి 'కుమ్మటము' జేరెను. తుర్లకు సైన్యములు దానిని ముట్టడించినవి. నెలరోజులు పోరు ఘోరముగ సాగినది. కుమ్మటము శత్రువులకుఁ జిక్కినది. అటనుండి జంబుకేశ్వరుఁడు బహాదుద్దీనుతోఁ గూడ 'హోసదుర్గము' జేరినాఁడు. చక్రవర్తి దానినిగూడ ముట్టడించెను. కొన్నిరోజుల కాకోటయుఁ బడినది. తుర్లకు సైన్యములు కొన్నిలక్షల కుండెను. జంబుకేశ్వరుని సైన్యము దానిలో నెన్మిదవవంతు గూడ లేదు. కుంతలేశ్వరుని ధైర్య సాహసములు జూడిదలో హోమమగుచుండినవి.

తనకు మరణము దప్పదని జంబుకేశ్వరుఁడు నిశ్చయించికొన్నాఁడు. అపు డాతఁడు 'బల్లాణు' నకు జాబు వ్రాసినాఁడు. అం దిటు లుండెను. "బల్లాణరాజా! మన పూర్వవైరమును మఱచిపొమ్ము. ఈ బహాదుద్దీనును రక్షింపుము. శరణాగతులను రక్షించుట రాజధర్మము." ఈ జాబును బహాదుద్దీనున కిచ్చి వానిని దారాపుత్రులతో బల్లాణునికడ కంపినాఁడు.

జంబుకేశ్వరుఁ డిఁక నిర్భయుఁడైనాఁడు. తనకడ నేఁబదివేల సైన్యము మాత్రము ఉండెను. ఆ చిఱు సైన్యముతోనే యాతఁడు యవనసేనా వాహిని నడ్డినాఁడు. సంగరము బ్రహ్మాండముగ జరగినది. అన్ని కోటలును శత్రువులకుఁ జిక్కిపోయినవి.

జంబుకేశ్వరున కిఁక జయించు నాస లేదు. అతఁడు కోటలోనికిఁ గబురంపెను. జంబుకేశ్వరుని భార్యలందఱు వహ్నిలో దూకి ప్రాణములు వదలినారు. ఇఁకఁ గుంతలేశ్వ

డునకు భూమిపై నేబలఁగిమును లేదు. అతఁడు పంపాపతిని దలఁచుచు యుద్ధమున దూకెను. ఈనిన పులి యట్లు జంబుకేశ్వరుఁడు బోరినాఁడు. అతని శరీరమంతయుఁ బోటుల జల్లెడ యయినది. పోరిపోరి జంబుకేశ్వరుఁడు సమరరంగమున శాశ్వతనిద్రవోయెను. శరణాగతుని రక్షించుటకై జంబుకేశ్వరుఁడు సామ్రాజ్యమును బలిపెట్టినాఁడు. హైందవధర్మ దీక్ష యట్టిది !!!!

---

## ౯. త్యాగరాజు

కావేరీతీరమునఁ బంచనద మను క్షేత్రము గలదు. అది శివక్షేత్రము. అందు 'రామబ్రహ్మ' మను నొక బ్రాహ్మణుఁడు నివసించుచుండెను. అతని జీవితము చాల నియమము గలదై యుండినది. రామబ్రహ్మము జీవిక భిక్షాటనము. అతని భార్య 'శాంతాదేవి.' ఆమె వెత్త్రి బాగులది. ఏనాఁడుగాని యది లేదిది లేదని భర్తను బీడించి యెఱుఁగదు. భర్త దెచ్చినఁ భిక్షపు గింజ లామెకుఁ బరమ భాగ్యము. అట్టి భార్య దొఱకుట రామబ్రహ్మము యొక్క యదృష్టము.

వారికి సంతానము లేదు. సంతానము లేదను దుఃఖము వారికి లేదు. అట్టి నిష్కామపరుల కోఱికలను భగవంతుఁడు బూరించును. కొంతకాలమున కాదంపతుల కిర్వురు కుమారులు జన్మించిరి. పెద్దవానికి 'జప్యేశుఁ' డని నామకరణము జేసిరి. రెండవ కుమారుఁడే లోకప్రసిద్ధుఁ



గాయకబ్రహ్మ శ్రీ త్యాగరాజు

డైన త్యాగరాజు. 'త్యాగరా'జన్నది యూరయూర వెల
సిన పరమశివుని పేరు.

రామబ్రహ్మము కుమారుల కిర్వురకు నుపనయ
నము గావించి చదువవేసెను. జ్యేష్ఠునకుఁ దండ్రిగుణ
మేమియు నంటినది గాదు. వాని బుద్ధి జాల విషమమైనది.

చదువుసంధ్యలుగూడ వాని కెక్కువగ నంటలేదు.
త్యాగరాజు చిన్ననాఁటినుండియు బుద్ధిమంతుఁడు. గురువు
జెప్పెడు బాఠములను శ్రద్ధగా నేర్చికొనుచుండెను. త్యాగ
రాజునకు సంస్కృతమునఁ జక్కని జ్ఞాన మేర్పడినది.
పంచనదమున వెంకటరమణదాసు లను గాయకు లుండిరి.
వారికడ సంగీతమునుగూడఁ ద్యాగరా జభ్యసించుచుండెను.
వీణను వాయించుటగూడ నలవాటు చేసెను. ఆ కాలమున
గాత్రపాట పాడువారందఱు వీణ నభ్యసించెడువారు.

త్యాగరాజునకుఁ జిన్ననాఁటినుండియే 'రామభక్తి'
యేర్పడినది. వారింటి దైవము రామచంద్రమూర్తి. తండ్రి
యైన రామబ్రహ్మమునకుఁ బూజకై దినమును ద్యాగరాజు
బూవులుఁ, దులసీయుఁ గోసికొనివచ్చెడివాఁడు. రామ
చంద్రమూర్తి కభిషేకమునకై కావేరి కేగి త్యాగరాజే
జలము గొనివచ్చెడువాఁడు. తండ్రిగారు రామచంద్రు
నకుఁ బూజచేయుచుండునంతకాల మూ పిల్లవాఁడు నిర్ని
మేష నయనుఁడై చూచుచుండెను. వయస్సు గడచు
కొలఁదియుఁ ద్యాగరాజునకు రామభక్తి గూడఁ బెరిగినది.

రామబ్రహ్మ మింతలో నిద్దఱు సుతులకును వివా
హము జేసినాఁడు. జ్యేష్ఠుని భార్య సర్వవిధముల భర్తకుఁ

జరిగినది. ఆమె మనస్సునిండ మచ్చరము, అసూయ, అత్యాశయే యుండెను. కుమారులకు వివాహమైన కొంత కాలమునకే రామబ్రహ్మము దనువు జాలించినాఁడు.

త్యాగరాజు తండ్రి యుద్యోగమును స్వీకరించెను. అతఁడు ప్రతిదినమును భిక్షకుఁ బోవును. రామచంద్రునకుఁ బూజా కలాపమును దీర్చును. పోతనామాత్యులు వ్రాసిన యాంధ్ర భాగవతమును దినమును పారాయణము సేయును. తమ్ముని యీ గుణము లేవియు జప్యేశునకు సరిపోవుట లేదు. జప్యేశుని భార్యగూడ త్యాగరాజును ద్వేషించు చుండెను. ఆమె సతతమును త్యాగరాజును దిట్టును. అతని భార్యపై నోరు జేసికొనును. త్యాగయ్య యీ బాధ బడలేక పోయినాఁడు.

అన్నదమ్ము లిద్దఱును విభాగములు పోయినారు. త్యాగయ్య తన కేయాస్తియు నలదని, తండ్రి యర్చించు చుండిన పూజాపేటికను మాత్రము గైకొన్నాఁడు. ఆనాఁ డాతని కెంత యానందమైనదో! ఆ రామలక్ష్మణ విగ్రహములకుఁ బూజ దీర్చి. 'కొలువమరెఁగదా! కోదండపాణి' యను కృతిని పాడెను.

వాల్మీకి రామాయణమును వ్రాసినట్లు త్యాగరాజు ఇరువదినాల్గు వేల కృతులచే రామవైభవమును వర్ణింప సంకల్పించినాఁడు. దినమును గొన్నికృతులను వ్రాయును. వానిని 'రామచంద్రుని' యెదుట గానము సేయును. భాగవత పారాయణము గావించును. ఈ రీతిగ త్యాగయ్య దినములు గడచుచున్నవి. ఇంతలో నాతని కొక చింత

పట్టుకొనెను. తనకు సరియైన గురువు దొరకలేదే యని యాతని బాధ. ఆ వ్యథతో నతఁడు గురుమహిమను వర్ణించుచుఁ గొన్ని కృతులను వ్రాసినాఁడు.

ఒకానొక రోజు సన్యాసి యొకఁడు త్యాగయ్యకు దరిసెన మొసఁగినాఁడు. అతఁ డొక గ్రంథమును త్యాగరాజున కిచ్చెను. దాని పేరు 'స్వరార్ణవము'. 'ఈ గ్రంథము నధ్యయనముసేయు' మని సన్యాసి త్యాగయ్య కాజ్ఞయిచ్చినాఁడు. ఆ సన్యాసియే 'రామతారకమును' గూడ నుపదేశించి, తొందరపడక యా మంత్రమును జపించుమనియు, నీ జన్మమున రామసాక్షాత్కార మగుననియుఁ బలికి వెడలిపోయెను. అతఁడు బోయిన పిదప, నా సన్యాసి నారదుఁడని త్యాగయ్య కర్థమైనది. అతఁడు భక్తిభావముతో నారదునిపైఁ గొన్నికృతులు బాడినాఁడు.

నాఁటనుండి త్యాగరాజు రామతారకమును దినమున కొక లక్షయు నెన్మిదివేలవంతున జపింప మొదలుపెట్టెను. అతని కే యైహికచింతయు లేదు. అతని జీవనమంతయు రామమయమై యుండెను. అన్నయు, వదినెయు మాత్రము నిష్కారణముగ నాతనిపై ద్వేషమును సాధించుచునే యుండిరి. ఆ సమయమున త్యాగరాజు పంచరత్నకృతులను వ్రాసెను. వాని సాహిత్యము ప్రౌఢమైనది. రాగసంచారక్రమముగూడ అత్యంతగంభీరమై, వారి పాండిత్యమును వెల్లడించును.

త్యాగరాజు 'స్వరార్ణవ' గ్రంథము నధ్యయనము జేసినాఁడు. ఆయన సంగీత పాండిత్యమున కాగ్రంథము

మెఱుఁగు వెట్టినది. ఆనాఁటినుండి త్యాగయ్య ముఖము నుండి యనర్గళముగాఁ గృతులు బయలుదేఱినవి. కొన్ని కృతు లాతని జీవితకాలముననే గాయకులలోఁ బ్రచారమునకు వచ్చెను. కాని వాటికిఁ గీర్త్యాశ లేదు. పాండిత్యప్రకర్ష లేదు. కాంతాకనకముల కామనస్పర్శ ప్రభావము లేదు.

త్యాగరాజు తొంబదియాఱు కోట్లు రామనామమును జపించెను. ఈనడుమ నాతఁడు బడిన బాధ లనేకములు. ప్రపంచజనులు దన్నెంతయో నిందించిరి. ఇంట దారిద్ర్యము సహస్రముఖములతోఁ దాండవించెను. అన్నయు, వదినెయుఁ దన్ననేకవిధముల నగడుబట్టించిరి. ఈకష్టములన్నిటిని త్యాగరాజు దాల్మితో సహించెను.

కడకు దశరథరాముఁ డాతనికి దరిసెనమొసఁగక తప్పినది గాదు. త్యాగరాజుభార్య మహాసుగుణవతి. ఆమె సర్వకాలములయందును భర్తను నీడవలె ననుసరించినది.

తంజావూరి రాజు కాలమున గొప్ప సంగీతవిద్వాంసుఁడు. అతఁడు త్యాగరాజు కీర్తిని విన్నాఁడు. ఆ రాజు త్యాగయ్యను దన యాస్థానమున కాహ్వానించినాఁడు. రాజసేవకులు వచ్చి, యావిషయమును త్యాగరాజున కెఱిఁగించినారు. అతఁడు తన హృదయము నపు డిట్లుకృతిరూపమునఁ బ్రశ్నించికొన్నాఁడు: "ఓమనసా! నీవే చెప్పుము. నీకు రామకీర్తన సుఖమా! నరపాలుర కీర్తన సుఖమా! రాజుల పొగడింతలే నీకు సుఖకరమైనచో రాజదూతలు వచ్చినారు. వారివెంట నీవు వెళ్లవచ్చును. మమతాబంధనయుతమైన నరస్తుతిని జేయవచ్చును." త్యాగరాజు మనస్సు రాజాదరణ

మున కంగీకరింపలేదు. "రాజాధిరాజైన రామచంద్రుని
యాస్థానమున నేను గాయకుఁడను. రాజదర్శనమునకు నేను
రాలేను. నా సంగీతవిద్య శ్రీరామచంద్రుల కర్పితమైనది.
అది మానవులను గొల్వదు" అని త్యాగరాజు రాజసేవకు
లతో నిర్భయముగఁ జెప్పివేసెను.

సేవకు లామాట దంజావూరు రాజుతోఁ జెప్పినారు.
రాజులు సామాన్యముగ నైశ్వర్య మదమత్తులు. బలవంత
ముగ త్యాగరాజు నీడ్చుకొని రావలసినదని భటుల కా రా
జానతియిచ్చెను. వారు త్యాగరాజుదగ్గఱకు సర్వసన్నాహ
ములతో వచ్చినారు. వారు వచ్చులోపలనే రాజునకు 'కుక్షి
శూల' యారంభమైనది. త్యాగరాజునెడలఁ దాను జేసిన
ద్రోహమే రోగకారణమని యానృపాలునకుఁ దట్టినది.
వాఁడు పశ్చాత్తాపపడినాఁడు. వెంటనేవచ్చి త్యాగయ్యపాద
ములపైఁ బడి, తన 'కుక్షిశూల' బోఁగొట్టవలెనని ప్రార్థిం
చెను. భక్తులు కరుణాళువులు. త్యాగరాజు వానిని క్షమిం
చెను. వేయిమందులతో మానని రాజరోగము భక్తుని
కటాక్షముతో మానినది. భక్తుల మహిమ యట్టిది.

ఇరువది నాల్గువేల కృతులను బూర్తిగ రచించి
త్యాగరాజు రామచంద్రున కర్పణము సేసెను.

తా నిలోకమునకు వచ్చిన పని పూర్తియైనట్లు
త్యాగయ్యకుఁ దట్టినది. ఇంతలో నాతని భార్య గతిం
చెను. పరమజ్ఞానియైన త్యాగరాజునకుఁగూడ నామె వియో
గము దుస్సహమైనది. ఆమె తన యాత్మగుణములచే భర్త
నంతగ లోఁబఱచికొనియుండెను. జప్యేశుని భార్య

యామెను ముప్పతిప్పలు బెట్టినది. ఒకనాఁడైన నామహిళ తన కష్టగాథలు భర్తతోఁ జెప్పి యెఱుఁగదు. ఇంటియందు దారిద్ర్యము దాండవించుచుండెను. ఆమె యెన్నఁడు విసిగి యెఱుఁగదు. తన కున్నంతలోనే కన్నసంతానమును క్రమ మెఱిఁగి పోషించుచు, భర్తహృదయమునకు శాంతి గలిగించెను. లోకు లనేకరీతులఁ బ్రాణపతిని నిందించుచున్నను భర్తయందామె నిరంతరము భగవంతునే చూచెను. ఆమె పాతివ్రత్యమునకు గౌరీదేవి-యాయూరియందున్న— 'ధర్మ సంవర్ధని' గట్టువడి, పిలిచిన పలుకుచుండెను.

భార్యావియోగమునకు త్యాగరాజు బాలుఁడై యేడ్చినాఁడు. ఇఁకఁ దా నీశరీరముతో నుండ లేనని రామునకు మొఱపెట్టికొనెను. శ్రీరామచంద్రుఁ డిట్లాజ్ఞాపించెను: "త్యాగరాజా! నీ కీజన్మమున జన్మరాహిత్యము లేదు. వచ్చు జన్మమున ముక్తుఁడవౌదువు."

త్యాగయ్యకు దిక్కుదోఁచలేదు. తన భక్తిసాధన యంతయు వ్యర్థమేనా! ఈ జన్మమున ముక్తిలేదా? ఆయన చాల దీనముగ రామచంద్రుని వెంటఁబడెను. రాముఁడు దయారాముఁడు. అతఁడు సెలవిచ్చినాఁడు: "నీవు సన్యాసివి గమ్ము. ఈ పుట్టువుననే ముక్తి సిద్ధించును. సన్యాసము వేఱుజన్మమునకు లెక్క."

రామునాజ్ఞచే త్యాగరాజు సన్యాసమును స్వీకరించెను. నాఁటి కేడవదినముననే యాతఁడు బరంధామమును జేరెను. ఆయన 'కృతులు' శాశ్వతముగ భూమిపై నిలచినవి.



# ౧౦. కవయిత్రి మధురవాణి

విజయనగరపతనానంతరము సాహిత్యమును, కళలను పోషించిన భాగ్యశాలురు తంజావూరి నాయకరాజులు. వీరియందుఁ గూడ మూఁడవ నాయకరాజైన రఘునాథ భూపాలుఁడు నాయకమణి. అతఁడు చాల పరాక్రమము గలవాఁడు. 'జాఫ్నా' కాతఁడు నౌకలతోనే వారధి గట్టెను. రఘునాథభూపుఁడు గొప్ప భక్తుఁడు గూడ. దివ్యక్షేత్రము లెన్నిటియందో యాతఁడు దేవతావిమానముల నెలకొల్పెను. ఆన్వీక్షక్యాది రాజతంత్రములందా రాజు మిగుల సమర్థుఁడు.

కేవల క్షత్రియోచితములగు విద్యలే కాక — ఇతర విద్యలకును రఘునాథుఁడు నిధి. అనేక భాషలందా మహారాజు సరసమైన కవిత్వము జెప్పెడివాఁడు. 'విజయవిలాస' మనెడు గ్రంథము నాంధ్రమున రచించిన చేమకూర వెంకట కవిని మహాకవిగా దిద్దిన రసికుఁడా భూపాలుఁడే. సంస్కృతాంధ్రముల నెన్నో గ్రంథముల నాతఁడు రచించినాఁడు. సాహిత్యమునందే కాక సంగీతమునందును నాతని కీర్తి గొప్పది. ఎన్నియో నూతన రాగముల నారాజు సృజించెను. ఎన్ని తాళములనో స్వయముగ నిర్ణయించెను. సంస్కృతమున 'సంగీతసుధ' మొదలైన గ్రంథముల రచించెను.

ఇట్టి కళాభినివేశము గలవాఁడు గనుకనే యా రాజెందఱో కళాకారులను పోషించెను. అతని యాస్థానమున

నసేకులు గాయకు లుండిరి. గాయనీమణులకు రఘునాథుని యాస్థానము విహారభూమి. ఎందఱో నృత్య విద్యాపారంగతు లుండిరి. అందఱికిని రఘునాథ భూపాలుఁడు సలహా లివ్వఁ గలఁడు. సమస్త కళలయందు నాతని యధికార మంతటిది!

రఘునాథుని కొల్వుకూటమునకు 'లక్ష్మీవిజయ' మని పేరు. అది కృష్ణరాయని 'భువనవిజయము' వలెనే నిరంతరము విద్యాగోష్ఠులతోఁ గలకలలాడుచుండెడిది. రఘునాథు నాస్థానమునఁ బ్రత్యేకత యొకటి గలదు. అతని యాశ్రయమునఁ గవయిత్రు లెక్కువ. కొందఱికి రఘునాథుఁడే స్వయముగ నాచార్యత్వమును నెఱపెడివాఁడు.

రఘునాథ భూపాలుని కవయిత్రులలో రామభద్రాంబ యొకతె. ఆమె సంస్కృతమున 'రఘునాథాభ్యుదయ'మనెడి మహా కావ్యమును రచించినది. దానియందు రఘునాథ భూపాలుని గుణగణములు విశదముగ వర్ణింపఁ బడినవి.

తంజాపురాధినాథుని యాస్థాన కవయిత్రులలో మణిపూస మధురవాణి. ఆమె కీ పేరు రఘునాథుఁ డొసఁగిన బిరుదు. ఈ బిరుదే ప్రసిద్ధమై యామె యసలు పేరు చరిత్రలో మఱగిపోయినది. ఈమెది విద్వత్కుటుంబము. చిన్ననాఁటనుండి శాస్త్రవ్యాసంగములతో నామె గడపినది. వ్యాకరణశాస్త్రము మధురవాణికిఁ గొట్టిన పిండి. తర్కమునం దామెకుఁ గల ప్రతిభ యపారము. సంస్కృతము మొదలైన యాఱు భాషలం దామె కవిత్వము జెప్పెడిదఁట!

ఆశుకవిత్వముల నడ్డులేక యల్లెడిది. సమస్యలను లెక్క
లేక పూరించెడిది. కఠిన శ్లోకములను చక్కఁగాఁ బండు
వొలిచి పెట్టినట్లు వ్యాఖ్యానించెడిది. ఆకాలమున నొక
శ్లోకమునకు అన్ని యాక్షేపణలకు సమాధాన మొసఁగుచు
నర్థముఁ జెప్పుట పెద్ద పాండిత్యము. నిరోష్ఠ్యములు మొద
లైన నియమములతో నతిసులభముగఁ గవిత్వము చెప్పెడిది.
ఆమె కింకొక చిత్రమైన యోగ్యత గలదు. ఒక తెనుఁగు
పద్యము నామె, దాని సౌందర్య మేమియుఁ జెడకుండ,
సంస్కృతమునకు మార్చఁగలదు. అట్లే సంస్కృత శ్లోక
మును దెనుఁగునకు మార్చఁగలదు. ఇది యొక ప్రత్యేకమైన
సంస్కారము.

సాహిత్యమునందువలెనే సంగీతమందును మధుర
వాణి ఘనత గొప్పది. ఆమె వీణ నద్భుతముగ వాయించును.
వీణలో గాత్రమును, తీగ మేమియుఁ దెలియనంతగా, మేళ
గించి పాడఁగలదు. ఏ క్రొత్తరాగమునైనను – మధురవాణి
పూర్వము దనకుఁ బరిచితమైన రాగమువలెనే యవలీలగఁ
బాడెడిదఁట. ఎంత కఠినమైన తాళమైనను–వీసమంత తప్ప
పోక, కాలము నేమాత్రమును మార్పక నిర్వహించెడిది.
రఘునాథుఁడు సృష్టించు ననేక రాగముల నామె జనరంజక
ముగఁ బాడును. సంగీత సాహిత్యములందామె యపర
సరస్వతి.

మధురవాణి రూపము రతీదేవివంటిది. రఘునాథ
భూపాలున కామెముఖమున సమస్త సౌందర్యము బుంజీ

భవించికొని యుండును. ప్రతిపక్షుల కామె పేరన్న గుండె దడ. ఆకాలమునఁ జేరెన్నికగన్న విద్వాంసు లెవ్వరుగాని యామెయెదుట నిలచి మాటాడలేకుండిరి. ప్రతిపక్షు లేమైనఁ బూర్వపక్షము పెంచినపుడు మధురవాణి చెక్కు లెఱ్ఱ వాఱును. అపు డా చెంపలు వసంతకాలమునందలి మామిడి చిగురులను దులకించును. మఱునిముసమే యామె ప్రత్యర్థి వాదమును ముక్కలు గొట్టును. అందుచే నాకవయిత్రి చెక్కు లెఱ్ఱవాఱినచోఁ. ప్రతిపక్షుల గుండెలు బగులును. కాని రఘునాథభూపాలున కామె యా చెక్కులను జూడవలె నని యాకాంక్ష. అందుచే నాతఁడు ప్రతిదిన మేదో నెపమున మధురవాణిని నివాదమున కెసకొల్పును. రఘునాథ భూపాలుఁడు రామాయణమును దెనుఁగున రచించియుండెను. దానిని దన యాస్థానకవులచే సంస్కృతమునకుఁ బరివర్తింపఁ జేయవలెనని యా మహారాజునకు బుద్ధి పుట్టినది. కావలసినచోఁ దానే యా రామాయణమును సంస్కృతమునకు మార్చఁగలఁడు. కాని, యా భూపాలున కది యొక వేడుక. ఆ రామాయణమును బరివర్తించుట కర్త్వారాలు మధురవాణియే యనుటయు నాతెఁ డెఱుఁగును. కాని యామెను వాదమునకుఁ గవ్వింపవలెనని రఘునాథుని యూహ.

మఱుదినమున రఘునాథుఁడు 'లక్ష్మీవిజయము'నఁ గొలువుదీరెను. ఆ సభాభవనమున కంతయు బంగారు తెగడులు గప్పఁబడినవి. నడుమనడుమ ముత్తెముల జాలర్లు వ్రేలాడుచుండెను. ఆ నృపాలుని యాసనము రత్నస్థగితము. దాని కిఱువైపుల యావనాంగులు నిలచి చామరలు వేయు

చుండిరి. మహారాజున కెదుట కవులుఁ, గాయకులుఁ, ప్రధానులుఁ, గరణములుఁ గూర్చుండి యున్నారు. వారియందే యక్కడక్కడఁ గవయిత్రులు జుక్కలలోని చంద్రబింబములై మెఱయుచుండిరి. మధురవాణికిమాత్ర మా కొలువునఁ బ్రత్యేకాసనము. అది యంతయు రజతమయము. వెనుకటి భాగమున నాలుగురత్నములు జెక్కఁబడినవి. అవి యామె షడ్భాషాపాండిత్యమును దెలుపుటకు. ఆమె యలవోకగా సభవైపు జూచుచుండెను. మధురవాణి కచ్చోటున్న పండితులు లెక్కయే లేదు. ఆమె చూపులయందు స్త్రీ సహజమగు లాలిత్య మాధుర్యము లొకవైపు; పాండిత్యగర్వ మొకవైపు. వీని సమ్మేళనముచే ఆ కన్నుల కేదో క్రొత్త యందము.

సభనంతయుఁ గలయఁజూచి రఘునాథ భూపాలుఁడనెను: "నేను రచించిన రామాయణమును సంస్కృతీకరింపఁగల వలతు లిందెవ్వరైన నున్నారా? ఆ రామాయణమును మూలమునందలి మెఱుగులు జెఱుపక గీర్వాణమునఁ బలికినచో నా వశ్యవాక్కులకు నిండుసభలో స్వర్ణాభిషేకము సేయుదును."

సభలో గుజగుజ లారంభమైనవి. కాని, యెవరును 'మేము గావింతు'మని పలుకు గుండెలు లేవు. రఘునాథ భూపాలుఁడు సామాన్యుఁడగు కవి గాఁడు. అతని చమత్కారములన్నిటిని సంస్కృతమునకు దింపఁగలవారెవ్వరు? ఒకవేళ నొప్పుకొన్నచో మధురవాణిదే యా యోగ్యత.

ఏమికారణమోకాని మధురవాణికూడ రవ్వంత సేపు జలికనది గాదు. "ఇంకెవ్వరైనను నరేంద్రుని ప్రశ్నకు సమాధాన మిత్తురేమో!" యని యామె గాచుకొనియుండును.

ఉత్తరమునకై రవ్వంత సేపు నిరీక్షించిన భూపాలుడు "ఆస్థానమున నట్టి ఘటికు లెవ్వరును లేనేలేరా?" యని నిరుత్సాహమున నన్నాడు.

చటుక్కున మధురవాణి లేచినది. ఆ లేచుట మెఱపు మెఱసినట్లే యుండెను. లేచినవెంటనే యామె నవ్వినది. ఆ నవ్వునకు సభ్యు లెన్ని యర్థములనో తీసిరి. మధురవాణి యనెను: "మహారాజా! రఘునాథుని యాస్థానము పాండిత్యమునకు గొడ్డుపోలేదు. ఆ యాస్థానమునందలి యొక స్త్రీ పండితాగ్రేసరులకు, కవివతంసులకు జవాబు చెప్పగలదు." ఆమె కనుబొమలు ముడివడినవి. ఆమె చెంప లెఱ్ఱవాఱెను. ఆనిటలమునందలి చిఱు చెమటలతోం గస్తురిబొట్టు దడిసెనది. రఘునాథుని రామాయణ కావ్యసౌందర్యమును సన్నను అప్పటి యా మధురవాణిముఖ మందగించెను. రఘునాథుడు జెఱు నవ్వునవ్వి, యామెకుం గర్పూరతాంబూల మిచ్చినాడు.

కొన్ని మాసములలో మధురవాణి రామాయణమును సంస్కృతీకరించెను. రఘునాథుని యాస్థానమందలి పండితు లెల్లఱు దానిని బరీక్షించి, యింతకన్నను మెఱుగుగం బరివర్తించుట యసాధ్యమన్నారు.

రఘునాథ భూపాలుడు మధురవాణికి స్వర్ణాభిషేకమును గావించెను. ఆ యభిషేకము గీర్వాణభాషాసరస్వతికే చేసినట్లుండెను.

# ౧౧. దానవీరుడు పొట్టి శ్రీరాములు

భారతదేశచరిత్ర త్యాగుల చరిత్ర. మన దేశమునం దనేక త్యాగరసికులు బుట్టిరి. ఆదర్శములకై ధనధాన్యములను త్యజించినవారు, సుఖములను విడచినవారు, సామ్రాజ్యములను వదలినవారు మన చరిత్రలోఁ గలరు. చరిత్రలోఁ బ్రాణదాన మొక విచిత్రమైన పద్ధతి. చాలకాలము వెనుక



దేవతలక్షేమమునకై 'దధీచి' తన ప్రాణదానమును గావించెను. అతనిని పురాణయుగములోని మహాత్యాగిగా మనము జెప్పికొనుచున్నాము. పావురమునకై ప్రాణదానమును గావింప 'శిబి' సిద్ధపడెను. నాగకుమారునకై జీవ

ములు విడువఁ బూనినాఁడు జీమూతవాహనుఁడు. బౌద్ధ యుగమున నిట్టి దానము లెక్కువ. ఆధునిక యుగమున రాష్ట్రసిద్ధికై ప్రాణదాన మొనరించినవాఁడు శ్రీ పొట్టి శ్రీరాములు. ఇతఁ డాంధ్రుఁడు. అనఁగా నాంధ్రకీర్తి మునకు జ్యోతి యన్న మాట!

శ్రీరాములుగారు నెల్లూరు మండలమువారు. జవ్వాది దిన్నె గ్రామము వారి జన్మస్థానము. వా రార్యవైశ్యులు. మొదటినుండియు సామాన్యమైన కుటుంబము. చిన్ననాఁటి నుండియు శ్రీరాములుగారు వినయవిధేయతలతో విద్య నేర్చిరి. విద్యకంటె నాతఁడు గుణసంపదపైఁ దన దృష్టి నెక్కువ కేంద్రీకరించెను. వారు మద్రాసునందు 'శానిటరీ యింజనీరింగు' పరీక్షకుఁ జదివిరి. దానియందు గడతేఱిన వెంటనే యుద్యోగమునఁ బ్రవేశించినారు. బొంబాయి యందు రైల్వే డిపార్టుమెంటున వారి యుద్యోగము.

ఇంతలో వారి జీవితమున మార్పు గల్గినది. వా రెంతయో ప్రేమించెడి భార్య మరణించెను. దానితో వారికి జీవితములోని యరుచి, అస్వాతంత్ర్యము గోచరించినది. భగవంతుని విధానములందున్న చిత్ర మట్టిది. ప్రపంచము నందలి యసారతను బోధించుట కాతఁ డొక్కొక్క విషయమున నొక్కొక్క మార్గము నవలంబించును. కొందఱికి దీవ్ర దారిద్ర్య మొసఁగి, వారిని మార్చును. కొందఱికి సంతానము నివ్వఁడు. ఈ ప్రణాళికల నెప్పు డెప్పు డెవ్వ రెవ్వరి విషయమున నడుపవలెనో యా భగవంతుని

కొక్కనికే తెలియును. శ్రీరాములుగారి జీవితమును త్యాగక్షేత్రముగా నొనరింపఁదలఁచిన భగవంతుఁడు వారి ప్రేమగ్రంథియగు భార్యను ద్వరగా దివ్యధామమునకుఁ బిలిచికొనెను.

నాఁటనుండి శ్రీరాములుగారు విరక్తులు. అనఁగా వారు కావిగుడ్డలను ధరింపలేదు. సన్యాసినని ప్రకటింపలేదు. వారు మనస్సులో విరక్తులు. బాహ్యమగు వేషము ఆంతరికమగు ప్రవృత్తికొక చిహ్నము మాత్రమే.

శ్రీరాములుగారు బిత్రార్జితమగు నాస్తిపై నభిలాషను వదలుకొన్నారు. ఆ స్తినంతయుఁ దమ యన్నదమ్ముల కొసఁగిరి. నాఁటనుండి వా రేకాకులు. ఆహార విహారములయం దత్యంతము నియమము గలవారు. గాంధీ మహాత్ముని యాదేశ మందికొని శ్రీరాములుగారు 'సబర్మతీ' యాశ్రమమును జేరినారు. అప్పటినుండి వారు గాంధీ మహాత్ముని యడుగుజాడలలో నడచిరి. వారి యాజ్ఞ ననుసరించి, రాజకోట, గుజరాతు మొదలగు చోటులలో మూఁడు నాల్గు సారులు సత్యాగ్రహ మొనరించినారు. కారాగార వాసమును బాగుగా ననుభవించిరి.

వారి జీవితవిధానము జాల మితమైనది. ఖద్దరు గోరంచుకమ్మి ధోవతులు ధరింతురు. పిడికెఁ డన్నమును, నియతమగు వేళకు భుజింతురు. పండుగలు పబ్బము లనెడు దృష్టి లేదు. ఎచ్చోటనైనను నిర్భీతిగ వారు దమ యభిప్రాయమును బ్రకటింతురు. ప్రక్కతాళము వేయుట

వారు నేర్వని విద్య. ఆ నిర్భీతికిఁ గారణ మాస లేకుండుట. స్వార్థబుద్ధిని వారు దరిజేరనివ్వరు. ఆగుణమును వారు నాగు బామువలెఁ జూచుచుండిరి. కాంతాకనకములపై దృష్టి శ్రీరాములుగారి కేనాఁడో తొలఁగిపోయినది. ఇఁక వారు గాక నికరమైన సన్యాసు లెవరు ?

గాంధీమహాత్ముని యుదారములగు నాశయములలో 'నిర్మాణ కార్యక్రమము' శ్రీరాములుగారికిఁ జాలఁ బ్రియ మైనది. వారు ప్రతిదినమును 'సూత్రయజ్ఞ' మాచరించెడు వారు. అనఁగా, మౌనముతో, భగవచ్చింతతో నూలు వడకుట. ఈ కార్యమునకు గాంధీమహాత్ముఁడు యజ్ఞత్వము నాపాదించెను. దానిని శ్రీరాములుగారు యజ్ఞమువలెనే యనుష్ఠించుచుండిరి. ప్రతిదినమును 'రామభజన' సేయు టయు వారి కార్యక్రమములఁ దొక్కటి. శ్రీరాములుగారి జీవితము రసికములగు నియమములతోఁ జాల సుందరమై యుండెను. ఆ సౌందర్యము స్వార్థపరులకుఁ దెలియనిది.

పొట్టి శ్రీరాములుగారికిఁ బ్రాణసమానమైనది 'హరి జన దేవాలయ ప్రవేశ' సమస్య. వా రెప్పుడును 'హరిజను లకు దేవాలయ ప్రవేశ మివ్వవలెను' అని వ్రాయఁబడిన యొక యట్ట నెదకుఁ దగిలించుకొని, నెల్లూరి వీథులలోఁ దిరుగుచుండెడివారు. ఆకాశమున భగ భగ మండుచు నిప్పులు జెఱుగుచున్న సూర్యుఁడు, క్రింద నా సూర్యుని వేడిమికిఁ గాలిన పెనమైన భూమి! అట్టి దుస్సహములగు

వేళలందును నెల్లూరి వీధులలోఁ గాలికిఁ జెప్పులు లేక, శిరస్సుపై 'ఛత్రీ' లేక తిరుగుచుండెడువాఁ డొక్కఁడే-పొట్టి శ్రీరాములు. అతని శరీరమునుండి చెమట లోడికలు గట్టి పాఱుచుండెడివి. ఎండకెండిన యా త్యాగధని శరీరము నల్లబాఱి యుండెడిది. కాని యా కన్నులయం దేదియో యగమ్య మగు జ్యోతి! ఆ వెలుఁగు దపస్సుచేఁ గలుగును. శ్రీరాము లట్టి తపస్సు జేసెను. ఆ తపస్సు స్వార్థపరులకుఁ జేయుటకు సాధ్యముగానిది.

ఈ గొప్పసేవ కాతఁడు సమకాలికులనుండి పొందిన ఫలము బరిహాసము మాత్రమే. స్వార్థపరమైన లోకము మహాశయములను సామాన్యముగా గౌరవింపదు. ఎంతటి వానినైనను దమ పరిధిలోని కీడ్చి "వీనిలోఁ బ్రత్యేకత యేమియు లే"దనవలెననియే సామాన్య ప్రజ యావేదన. అందుచే వారు పొట్టి శ్రీరాములు నొక పిచ్చివానినిగాఁ జూచుచుండిరి. జీవితరంగమున నతఁ డొక పరాజితుఁడని వారి యూహ. తామేమో మహా ఘనులైనయట్లు! తమ కుటుంబమునకుఁ దా మన్నముబెట్టి పోషించుకొనుట యేదో యొక పెద్ద చరితార్థత యైనట్లు! అతని సందఱు హాస్యమాడెడువారఁట! ఇగిలింపులలో నాంధ్ర దేశ మందఱికంటె నాలుగాకు లెక్కువ చదివినది. శ్రీరాములుగారీ వేళాకోళములను వినుటయే లేదు. వారి మన స్సైకాగ్రము. వారి జీవితము నియమబద్ధ మగు యంత్రము.

ఆంధ్రరాష్ట్రము గావలె నను సమస్య యీనాఁడు బుట్టినది గాదు. ఆ యుద్యమమునకు సుమారు ముప్పది నలువది సంవత్సరముల వయస్సు. 'భాషారాష్ట్ర సిద్ధాంతము' మహాత్ముఁ డంగీకరించినదే. కాని మన నాయకులు ఒకరొక్కరు ఏకైక శూరులు. అందుచే నింతవఱకు వారంద ఱొక కట్టునకు రాలేదు. ఆంధ్రరాష్ట్రము సిద్ధింపలేదు. 'కేంద్రప్రభుత్వము'నకు భాషారాష్ట్రములపై నంత యాదరము లేదు. వా రాంధ్రుల చిత్తప్రవృత్తి బాగుగ నెఱుఁగుదురు. "మీరంద ఱొకమాటకు వచ్చినచో మా దేమున్నది? వెంటనే రాష్ట్రము నొసంగుదు" మనుచుండిరి.

రాష్ట్రసమస్య శ్రీరాములుగారి దృష్టి నాకర్షించినది. గాంధీమహాత్ముని నాయకత్వమున వారు నేర్చిన విద్య యొక్కటే. అది సత్యాగ్రహము, ప్రాణదానము. అది సాత్త్వికమగు యుద్ధము. దానికిఁ గావలసిన సైన్య సామగ్రి యాత్మశక్తి యొక్కటియే. కాని, దాని బల మనంతము. అది కాలమును మార్చును; దేవతల నోడించును.

"ఆంధ్రరాష్ట్రము నిత్తు"మని కేంద్ర ప్రభుత్వము ప్రకటించువఱకు నిరాహారదీక్ష సాగింతు" నని శ్రీరాములు గారు నిశ్చయించుకొనిరి. ఈ వార్త పత్రికలలో 'ఠంగు' మని మాఱుమ్రోఁగినది.

శ్రీరాములుగారు మద్రాసులో బులుసు సాంబమూర్తిగారియింట నిరాహారదీక్ష నారంభించినారు. దేశ

మెల్ల నట్టుడికిన ట్లుడికినది. ఆంధ్రనాయకులెల్లరు దీక్షను చాలింపవలెనని వారిని కోరిరి. కాని శ్రీరాములుగారు ''కేంద్రప్రభుత్వప్రకటనముగువఱకుఁ జాలింప'' నన్నారు. కేంద్రప్రభుత్వము జాగుచేసెను. శ్రీరాములుగారి భౌతికకాయ యసువులు వీడెను. నాఁడు మద్రాసునగరమంతయు నొక్క శోకసముద్రము.

మరణానంతరము శ్రీరాములుగారి మహాత్మ్య పదింతలుగఁ బనిచేసినది. 'రాష్ట్రము'నకై దేశమున ననంత కల్లోలము జరిగెను. 'కేంద్రప్రభుత్వము' వెంటనే 'రాష్ట్రదానము'ను ప్రకటించినది. నేఁటి యాంధ్రరాష్ట్రము శ్రీరాములుగారి 'దయాభిక్ష.'